# లక్ష్మణమూర్ఛ

(ఆఱంకముల నాటకము.)


గ్రంథకర్త:

సోమరాజు రామానుజరావుగారు.





ప్రకటనకర్త:

చందా నారాయణశ్రేష్ఠి

బుక్కుసెల్లర్సు & పబ్లిషర్సు.




సికింద్రాబాదు:

శ్రీబాలాత్రిపురసుందరీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1933



పీరైటు రిజిష్టర్డు)


(వెల రు. 0—12—0

# ఇందలి పాత్రలు.

---

## పురుషులు

1 రాముడు
2 లక్ష్మణుడు } రామాయణ కథానాయకులు
3 హనుమంతుడు — రామభక్తుడగు కపి.
4 సుగ్రీవుడు — వానరరాజు.
5 అంగదుడు — వానర యువరాజు
6 సుషేణుడు
7 నీలుడు } వానరులు
8 రావణుడు — లంకాధిపతి.
9 విభీషణుడు — రావణభ్రాత యగు రామభక్తుడు.
10 ప్రహస్తుడు — రావణమంత్రి.
11 ద్విజింహుడు — రాక్షసకవి
12 ఇంద్రజిత్తు — రావణపుత్రుడు.
13 మహాకాయుడు
14 దీర్ఘకాయుడు } సేనానాయకులు.
15 శుకుడు — రాయబారి.
16 సూతుడు — రావణసారథి
17 కాలనేమి — రావణుని మామ.
18 పంచముడు
19 పాషండుడు } కాలనేమి శిష్యులు.

## స్త్రీలు

1 సరమాదేవి — విభీషణపత్ని.
2 మాయాసీత.
3 సులోచన — ఇంద్రజిత్తుభార్య
4 త్రిజట — సరమ కుమార్తె
5 ధాన్యమాలిని — శాపగ్రస్తయై మొసలిగానున్న అప్సరస.



శ్రీ

# లక్ష్మణమూర్ఛ.



## ప్రథమాంకము.



రంగము:—సముద్రతీరము.

(ప్రవేశము:—హనుమంతుని దగ్గరనుండి మాణిక్యమందుకొను రాముఁడును, బరివేష్టించి కపులును.)

### 1. అనుబంధము.

రాము—ఆంజనేయా! ప్రభుకార్య విధేయా! శతయోజనపరిమితం బగు సాగరంబును లంఘించి, యపారంబగు లంకాపురమును శోధించి, లంకిణీ యక్షకుమారాది రాత్రించరులను దునుమాడి, పతిలాలసయగు జానకిం బొడఁగాంచి మత్సందేశ వార్తల నెఱింగించి, రావణసభామధ్యంబున మధ్యందిన మార్తాండబింబంబుకైవడి వెలింగి, యీ దురాత్మున కాత్మప్రబోధంబుఁ గల్పించి, మఱియు సేనాపరాక్రమంబుఁ జూపి, లంకాపురం బామూలాగ్రంబుగఁ బ్రబల పావకకీలాగ్ని మాలికలం గాల్చియీ శిరోమాణిక్యంబును నాకర్పించిన నీ ఋణంబు నేను దీర్చుకొనలేను.

సీ. సంసారనామక • సాగరంబుఁ దరించి
నిగమక్రమంబును • నిలిపినావు

శుక, సారణులు రామునివార్త సక్రమముగా నెఱింగిరో కాక వారు నయిత మాదుష్టులవాతఁ బడిరో? రాముఁ డెక్కడ నున్నాఁడో? ఏమిచేయుచున్నాఁడో? ముందాతని ప్రయత్న మేమో? ఏమియుఁ దోఁచక నామనం బాందోళన మందుచున్నయది.

మహా—మహాప్రభూ! ఇందుల కింత యాందోళన మేల?

రావ—మహాకాయా! ఆందోళనమని మెల్లగా నందువేమి? ఆందోళనము కాదా మఱి? రామబంటునని పేరుఁబెట్టుకొని వచ్చిన కోఁతి, లంకయంతయుఁ గాల్చి చనుట మహోత్పాతహేతువుగ మీకుఁదోఁచుటలేదా? ఎన్నడునిర్మించితిమో; ఎన్నితరములనుండియు, నిత్యమంగళమును బచ్చతోరణముగ నెగడుచున్నదో అట్టి లంకాపురము స్మశానసన్నిభమగుట మన కశుభదాయకమును, నాందోళన కారణము నని నీకుఁదోఁచుటలేదా?

ఇంద్ర—జనకా! ధీరపురుషులగు మీకీనిష్కారణ సంశయ విషాదంబులు కూడవు. నా బ్రహ్మాస్త్రమున సొక్కి వ్రేటున నేలఁబడిన కపిని బద్ధుఁ జేయుచుంటి నేమి? అదిగాక, లంక కాలుట ప్రమాదముగాని యాకోఁతిశౌర్యమం దేమియున్నది? మీరిటు హెచ్చించెద రేమి? మీరు రాజనీతియని వదలితిరి గాని యామర్కటు మీఁదివరకె నరకద్వారమున వెలపింపకుండెనా?

విభీ—బాలకా! మేఘనాథా! సుపుత్రుఁడవు జనించితివి! చాలు చాలు! నీతండ్రికెప్పుడు నిట్టి విషమే పోయుచుంటివి గదరా! ఏమీ! ఆంజనేయుఁడు శౌర్యవంతుఁడు కాఁడేమి?

4. అనుబంధము.

సీ. ఒకగంతులోన మ ♦ హోదధి లంఘించి
లంకఁ జేరినవాఁడు ♦ బలశాలియగునా?

తొలిముద్దుఁ గాఁ జేసి ♦ యల లంకిణిం ద్రుంచి
నట్టి గొప్పబలుఁడు సా ♦ మాన్యుఁడగునె?
సీతమ్మ నరయు ♦ నిముసంబులో నేల
నణఁచిన రణవీరుఁ ♦ డల్పుఁడగునె?
యుపమాన భవన స ♦ మంచితంబౌ లంక
నిట్టె గాల్చినవాఁడు ♦ హీనుఁడగునె?
గీ. రామదాసుఁడై యిట్టి కా ♦ ర్యము లొనర్చు
వీరుఁడగు రాముసఖుఁడది ♦ యెంచవలదె?
దారుణంబగు విషమ సం ♦ దర్భమందు
భావియోచన లేకిట్లు ♦ పలుకఁ దగునె?

రావ — విభీషణా! మీ యందరి చిత్తము లెట్టులుండునో, తెలిసికొనవలయునని నే నిట్లు ప్రశ్నించుచుంటినే కాని, కోతికి భీతి నంది గాదు.

ఇంద్ర — జనకా! ఏదియో ఆర్తస్వనము వినఁబడుచున్నది.

(తెరలో.)

దానవ సార్వభౌమా! రక్షింపుము. రక్షింపుము.

రావ — ఎవరద? శుకా! ఇటు రమ్ము. [illegible]?

(శుకుఁడు ప్రవేశము.)

శుక — దానవసార్వభౌమా! రక్షింపుము! రక్షింపుము!

రావ — శుకా! నీకు బాధయేమి? నిన్నెవ్వరు బాధించిరి?

శుక — ఏమి చెప్పఁగలను? మహాత్మా! అసంఖ్యాకములయిన గోలాంగూల కపియూథంబు లార్చుచు నాపైఁబడి ప్రాణావశిష్టునిఁగాఁ జేసినవి?

రావ — ఆఁ! ఆఁ!! ఎంతపనిచేసిరి కపిచండాలురు? శుకా! తరువాత?

శుక — స్వామీ! తరువాతఁ బులిచర్మమువలె మడతవేసి చంకను

బెట్టుకొని రామనామస్మరణాసక్తుఁ డగుకోఁతి యొకఁడు నన్ను మోసికొనిపోయి యొకపురుషునియొద్ద నుంచెను.

రావ—ఎవఁడా పురుషుఁడు? రాముఁడా యేమి?

శుక—విన్నవించుచున్నాను. నీలమేఘముకన్న లేతరంగువాఁడు. పట్టుకన్న నిగనిగఁగల వర్ణముఁగలవాఁడు. పూర్ణిమనాఁటిచంద్రబింబమువలె కళకళలాడు మొగముఁ గలవాఁడు, అంతమైనను విడువని శాంతముఁ గలవాఁడు. జపాపుష్పసంకాశమైన కపోలముఁ గలవాఁడు.

రావ—ఛీ! బానిసా! ఈ సామవర్ణనమంతయు నేల? తొత్తువై వాని కడఁ బడిచావక తిరిగివచ్చితివేమి?

శుక—అట్లే తలంచితిని గాని, రాముఁడు మీతోడ నొకమాట చెప్పుమనుటచే నిట్లు తిరిగి రావలసివచ్చినది.

రావ—ఏమి చెప్పుమనెను?

శుక—అవధరింపుఁడు:—స్వామీ! ఇవి రామమూర్తి మాటలు.
ఓ దానవచక్రవర్తీ!

సీ. నలుమొగంబుల తన ♦ కల్పనానంతరుఁ బని
మొగములు [illegible] ♦ భూ[illegible]
హర్షంబు సందన ♦ యజునకు [illegible]
వార్త నెఱిఁగించి ♦ కనటుముంచి
చిన్నబుచ్చఁగలేను ♦ చెడుబుద్ధి మాని, మా
జానకి నిచ్చి సా ♦ ష్టాంగపడుము
కానిచో స్వామిగ ♦ గ్రముగ నీ ర[illegible]ంబు
నణముంచి నీ పుర ♦ గాంబునింక

గీ. నా యశః పవిత్రమున వ్రాసి ♦ నవినభవ్యన
కెలుకఁ జేసి నేత్రంబుల ♦ నెనిగిరింట

బాష్పముల రాలఁ జేసి యా • వరమువ్రొజ్య
మైల స్నానముఁ జేయింప • వలసివచ్చె
నని విచారించు చుంటినో • యసురనాథ !

రావ—ఆఁ, ఏమి? శుకా! ఎంతనిశ్చయముగా నిట్టిరాయబారమును దెచ్చితివి? ఇట్టి యసందర్భవాక్యముల నాడిన పాపాత్మునకు బంటవై, బానిసవై, నా చెవులు చిల్లులుపడనిట్టివార్తఁదగుదు నని మోసి తెచ్చితివటరా? ఛీ తులువా! నాయువ్వాఁ దినిన విశ్వాసము కుక్కకైనఁ గలదు గాని నీకు లేకపోయెను! విశ్వాస మున్నవాఁడ వైనచోఁ బ్రాణములకైనఁ దెగించి రామునిపై విజృంభింపకుందువా?

విభీ—అన్నయ్యా! వానినిపై నాగ్రహించుటేల? వాని ధర్మమును వాఁడు నిర్వర్తించెను.

రావ—విభీషణా! నీకు తెలియ దూరకుండుము. ఇట్టి పావురపుబీర్ణ మువంటి గుండెకాయలుగల పిరికిపంద లింకెంద ఱీసభలో నున్నను నిట్టుల వామపాదమునఁ దన్ని సాగనంపెదను. ఛీ, పౌరుషహీనుఁడా! ఛీ విశ్వాసఘాతుకుఁడా! నాసభ వదలి పో. (శిరస్సు వంచి నుంచుము.)

శుక—(స్వగతము) స్వజనావమాన కారణుఁడ వగు నీకుగొంతుకోత యుఁ దప్పదులే, తొందరపడకు. (నిష్క్రమించును.)

రావ—సభాసదులారా! వింటిరా వింటిరా? ఈ రాముని దురాలాపములు! ఈరాముని యశక్తదుర్జనత్వము! తాను నా గతిక్రై విచారించుచుండెనఁట! హహ్హా హ్హా హ్హా! ఏమీ!రామునకు నాపై నెంతదాక్షిణ్యము! ఎంతయనురాగము? బ్రహ్మదేవుఁడు తనముదుట సదా విచారమే లిఖించియుండగా నాకొఱకివ్వాఁడు ప్రత్యేకగా విచారించుచున్నాఁడు ?

సీ. సర్వసిద్ధంబైన ♦ సామ్రాజ్యయత్నంబు
భంగమౌటకు మది ♦ వగవలేదొ?
సవతితల్లియుఁ బిత ♦ జనకుండు నేకమై
యడవులఁ గంపఁగ ♦ మిడుక లేదొ?
పదునాలుగేడులు, ♦ వనములందుఁ జరించి
దీనతనందఁ జిం ♦ తింపలేదొ?
ఆలి, నయోనిజ, ♦ సవసిజ, నేను హ
రింపంగఁ దావిచా ♦ రింపలేదొ?

అనయ మడవి నలో లక్ష్మ ♦ ణా! యటంచు
నేడ్చు గతికైన కుందు వ ♦ హింపలేదొ?
తుదకు భార్యను గొన్నట్టి ♦ దుర్గతిని వ
చించి జాలినిఁ గొని విచా ♦ రించినాఁడె?

ఇంద్ర___దానవసార్వభౌమా! మీ రారామునకుఁ గీమునకు దల్లడిల్ల నక్కఱలేదు. వానిని దృణమాత్రముగానైన నూహింపన క్కఱలేదు. భండనప్రచండ రాతిఖండన మహాకౌండుఁ డగు మీపుత్రుఁ డింద్రజిత్తుఁ డుండఁగా మీ కీసంశయములతో నేమిపని? మహారాజా! ఇ[illegible] కేమందువు?

మహా___మహాప్రభూ! ఏమందును? సమస్తవానరసైన్య సమేతంబుగ రామలక్ష్మణులు సీతావియోగ విషాదనామోచ్చారణయుక్తులై సంగ్రామకాళికి భూతబలి యొసఁగుట నిర్ధారణ మొందును. దైత్యదానవపరివేష్టితులై కుబేరాననమధ్యమున మణిమయకనకదీప్తి ప్రభారాసులు దిగంతంబులకు వింత కాంతు లొసంగ సమస్తాభరణభూషితులై మీరు, రామపత్ని సీతతోఁ గల్యాణము నంది యీ లంకాపురము నాచంద్రతారకముగాఁ బరిపాలింతు రందును.

ద్విజిం.—కాదు కాదు. మహాప్రభూ !

ప్రహ—ఛీ పశువా ! శుభములో నశుభము నాడితి వేమి ?

ద్విజిం.—కాదు కాదు. మహాప్రభూ ! ద్విజింహాకవిసింహాగర్జములను నవరత్నపద్యమాలికాభివర్ణములను, దేవర యొసంగు గండ పెండేరముల, నానుము మహాకాయుఁడు మఱచినాఁడని విన్నవించుచుంటిని.

మహా—వైద్యుఁడవగు కవివి, విషముచేతనైనఁ బ్రాణముచేతనైన చంపఁగలవు. నిన్ను మఱతుమా ! దీర్ఘకాయా ! రావణ విజయమున నీ యభిప్రాయ మేమి ?

దీర్ఘ—ఏమున్నది ? తండోప తండంబులై, భూనభోంతరాళములు పటాలున బ్రద్దలగు తెఱంగున, వార్చిపేర్చు నీ దానవయోధాగ్రేసరసమానీత సేనాసాగరంబుల యెదుట కోతులుకొండ ముచ్చులు నిలువఁగలవా ? నిలిచి గెలువఁగలవా? లంకాపురమునఁ బుట్టిన దోమయయిన, నీ పదునాలుగు జగంబుల వారిలోనొక్కనికైన వెలువ బనిలేదు. రణమున ఢీకొందము. సీతారావణ కల్యాణవార్తలను చెవులార వించము. ప్రహస్తా ! నీ యభిప్రాయ మేమి ?

ప్రహ—మా ద్విజింహాకవి యభిప్రాయ మెంతో నా యభిప్రాయ మంతే! ఇఁక విభీషణు నడుగవలయును.

ద్విజిం—(అప) విభీషణా ! ఈపదరుబోతు లందఱు నేమేమో శూరాలాపము లాడుచున్నారు. వీరందఱకు బుద్ధివచ్చునట్లు మాటాడుము. (ప్రకాశముగా) విభీషణా! నీవేమి యూరకుంటివి ? రావణవిజయము నీకు సందేహాస్పదమా యేమి ?

విభీ—ఆహా ! ముమ్మాటికి!

రావ — విభీషణా! ఎందుచేత?

విభీ — దానవనాథా! ఎందు కీవీరాలాపములు? ఎందుల కీనిరర్థక కాలయాపనములు? ఎందుల కీయాడంబరవాక్యములు? ఎందుల కీసన్నిపాతసల్లాపములు? నీహృదయముం గనిపెట్టి విన్నన్న చెప్పినది వేదమనునట్లు తలలూచి యుపమార్గమునం బోవు నిన్ను మఱింత కంటకావృతమగు మార్గమునకు లాగు నీవీరమ్మన్యులందరు నిన్నుద్ధరించి గెలిపించువారనియే నమ్మికొంటివా?

గీ. ప్రభు దయారస నిరత సం ♦ పాదనకయి
చెవిం గొఱుకువారు, నిచ్చకాల్ ♦ జెప్పువారు,
వంచకవినయమును నటి ♦ యించువారు,
తత్క్షణము గొంతు గోయంగ ♦ దగినవారు.

నీమనస్సురంజించి నీసొమ్ముందినుట కెన్నిప్రియవాక్యములనైనం బలికి తుదకు నీధనముతోం బాటు ప్రాణమును హరింపనున్న నీ యాశ్రిత తతులు వారసతులవంటివారని నమ్ముము. జ్వరితునకు నేలవేముకషాయమువలెం దుదకు సుఖమునిచ్చు మావంటివారి విహితబోధనము వినక నిచ్చకంపుమాటలకు లోనగుదురేని మధుమేహముగలవాండు శర్కరసేవించిన ఫలితముంగలుగంగలదు. నీకీర్తిని, నీ క్షేమమును, నీ బ్రదుకును గోరి నీకు తమ్ముండను గావున నీ యాగ్రహమునకు జంకక, నీవలననుపకారమున కాశింపక నిష్కాముండనై వచించునా మాటలయందు, గంటసేపటినుండియు గ్రుక్కతిరుగకుండ నుపదేశించిన వారిపలుకులందుంచిన విశ్వాసమున సగము విశ్వాసముంపుండు. నాపలుకులలోని సత్యాసత్యముల నొక్కయరనిముసము—ఒక్కయరనిముసముచాలును—చక్కంగా నాలోచింపుండు. సీతను దెచ్చుట న్యాయమో అన్యాయమో చింతింపుండు.

రావ– సీతాపహరణ మన్యాయ మేమి? రాముఁడు మనచెల్లెలి నవమానించి ముక్కు చెవులంగోయుట న్యాయమయ్యెనా? అందుల కీప్రతిఫలముచేయుట పాపమనుచుంటివా?

విభీ—శూర్పణఖాభంగమునకే మారీచప్రతిక్రియ చేసినచోఁ గొంత వఱకు సమ్మతింపఁదగును. సీతాదేవిని మోసగించి తెచ్చినం దుననే యిట్టి దుష్కీర్తి గలిగెను. దానికేమిగాని—

రావ—సీతను దీసికొనివచ్చి యేమపకృతి గావించితినని లోకులు నన్నుఁ దెలివిమాలి దూషింపవలయు? జానకిని సిగపూవు వాడకుండఁదెచ్చితిని. అశోకవనమున నుంచితిని. మహావైభ వంబులను సమర్పింతునంటిని. వివాహమాడి రాక్షసరాజపట్ట మహిషివగుమంటినిగాని నీచుఁడగు రామచండాలుఁడొనర్చి నట్లు ఆఁడుదాని నవమానింపలేదే? సీతను నే నవమానింపనే వలయునన్న రామలక్ష్మణుల కున్నపాటి ఖడ్గసాధనములు న కడ లేకుండెనా? రెండుచేతుల తుచ్ఛనరాధమునిపాటిచేతుల లేకుండెనా? కోయవేవలయునన్న సీత ముక్కు చెవుల మాత్రము మేము కోయలేమా? కోయించలేమా? అట్లు చేసితిమా! స్త్రీజనమానరక్షణబుద్ధి లేని రామునకు బుద్ధి వచ్చుట కీపనిని జేసితిని.

ప్రహ—ఆహాహాహా!!! ద్విజింహా! మనరాజుగా రెంతదూరపు మాటను సెలవిచ్చిరో వింటివా!

ద్విజి—(అప) ఇచ్ఛకాలముండకొడుకవుగాని పెండ్లియాడదలంచిన కాంత ముక్కుచెవులు గోయ్యు రసిక నెందైనఁ జూచితివా! పోనిమ్మూచుప్పనాతియే సీత కపాయమెంచెను గాని రామ లక్ష్మణుల పల్లెత్తుమాటాడినదా? (ప్ర) ఆహాహా!! మహా రాజుగారి ధీరోదాత్తత!

విభీ — మహారాజా ! ఏటి కీగతజల సేతుబంధనము ? సీతాపహార ణార్థమై మీరు పదినెలల క్రిందట మారీచాశ్రమమున కేగు నప్పుడు "సీత మహామారి. వలదు. లేవలద" ని చెప్పినమీరు పెడచెవిం బెట్టితిరి. పదునాలుగువేలకంచురథముల ఖరదూష ణులు గతించిరి. మారీచుఁడు మడసె. సురనాథుల కజేయ యగు లంకిణి చచ్చెను. జంబుమాలి సమసెను. అక్షయకుమా రుఁడుహతమయ్యెను. లంకాపురముపావకార్పితం మయ్యెను. శుకసారణులుతన్నులు తిని వచ్చిరి. సీత లంకఁ జేరకమున్ను గలశాంత మిప్పుడు లేదు. ఆయానంద మిప్పుడులేదు. దినమున కొక నూతనోత్పాతము సంభూతమగుచుండుటయు బొట్టకై చేరిన నీబానిస లందఱును దాని నెట్లో సమర్థించి హర్షించి వీరాలాపము లాడుటయును, మీ రాకల్లబొల్లిపలుకులు నమ్మి కన్నులు మూసికొని వర్తించుటయు నేఁకఁ జూచిసహింపలేను. అన్నయ్యా! మీరు నన్నేమన్నను సరియే. ఈ దుస్తంత్రములు నీ యుచ్చకములు, నీ వృథావాగ్వైరుష్యములు రాముని యందు గవ్వపసి చేయవు. ఆరాముని బంటయి వచ్చిన కపి మాత్రునిఁ గదలింపలేక నొంపలంటించుకొనిన యీశూరు లేమి ? రాముని గెలుచు టేమి!? సోదరా ! చెడవలదు. మీ మేధస్సునుపయోగింపఁ దగినతరుణ మిదియే! ఈమీపాలవా రందఱు పై వేసాలవారే!పనిమొదవినపుడుప యోగింపఁదగరు. ఇప్పటికింకను మన కేమియుఁ జెడలేదు. చెడఁదగినది ముందు న్నది. భావివినాశమును భావమునఁ దిలకింపుఁడు. ఇప్పుడే సీతను రామున కిండు. శూర్పణఖను వారూరకే శిక్షింప లేదనియు మనతో శూర్పణఖ చెప్పినమాటలయం దసత్యము గలదనియు, వినియు శూర్పణఖావమానప్రతీకారమని చెప్పిద

రేమి? ఇంతకు శూర్పణఖయే మూలము! సీతను రామునికిచ్చి సుఖముగా నుండుము అన్నా! రావణా! నా పలుకులు వినుము. చెడవలదు. చెడవలదు. చెడవలదు.

5 అనుబంధము.

ప్రహ—(అప) ద్విజంహా! విభీషణుఁడు మనలందఱ వరుసపెట్టి తిట్టుచున్నాఁడు. రావణునకొక నేపాళమాత్ర తగిలించి వీని శృంగభంగము చేయింపలేవుగా!

ద్విజం—(అప) తొందరపడకు. సమయము రానీ! వీని సముద్రము దాటించెదనులే!

ఇంద్ర—తాతానుజా! ఏమిపలుకు లివి? నాతండ్రి మీకు పితృతుల్యుఁడు, మహారాజు. సకలరాక్షసరాజ్యమునకు ను-కాదు కొంచెము తక్కువగా పదునాలుగుజగములకు నేలిక యయిన యీసార్వభౌముఁడు మనుజపశువు యొకనరపురుగు కాంతను దెచ్చెనఁట- వీరివర్ధితమగు రాక్షసవంశమున జనించిన యిందఱు బ్రదికియుండ నాతనికొఱ్ఱె-తీర్పఁబడునఁట్ట- ఛీ! ఎంతలజ్జ యగు మాటాడితిరి? ఇది యెంత పెద్దవిషయము! ఉప్పునసూదనంతరిక్షమున కెగిరిపోవలసిన నరుని పాదములపైఁ దెచ్చినకాంతను పడవేయవలయునుగా! ఆ కులటకొఱకెంత కలహము జించుకొంటిరి! ఎంత యుత్పాతము సూచించితిరి? పాపము!

విభీ—ఓరీ వెకలీ! మేఘనాథా! ఇంద్రుని జయించినగర్వము నీ శల్యములనుండి తల కెగఁదట్టి నీనోట నీకారులు ప్రేలించుచున్నది. సాధ్వియగు సీతాదేవి నిట్లు కులటయన్న నీ కెట్టి దుర్మరణమును విధి నిర్ణయించియున్నాఁడో కదా!

ద్విజుం—(అపహారించి రావణునితో) మహాప్రభూ ! భర్తృదారకుని స్మృతి నీచండాలుఁ డెట్లు సూచించుచున్నాఁడో వింటిరిగదా!

ఇంద్ర—అయ్యా ! పెద్దలని మి మ్మనేక మాఱులు మన్నించితి. ఇఁక నెన్ని మాఱులో మన్నింపలేను. ఏవేళ కాగ్రహముమీఱి యే మిగాపింపవలసివచ్చునో యని భీతిల్లుచుంటిని. తమ కింత పితికి తనమైన చో గృహమున కరిగి సుఖముగానుండఁగూడదా?

విభీ—ఓరి బుద్ధిహీనుఁడా ! ఒకచెంపఁ గొట్టిన పాలు నొకచెంపఁ గొట్టిన నీరునుగల నీవఁట గా నాపిరికితన మెన్నునది!?

రావ—మేఘనాథా !నీ వూరకుండుము. నీవాతనితోఁ బ్రస్తావింప వలదు. విభీషణా ! ఇది పిఱికితనము గాకేమి?

విభీ—నయోపదేశము పిఱికితన మెట్లగును? ధర్మచింతనము ధైర్యహీనత యెట్లగును? వినయబోధనముపిర్యాభావ మెట్లగును?

రావ—ఏమి ! ఏమి ! నయోపదేశమా ? ధర్మచింతనమా ? వినయబోధనమా ? హాహ్హాహ్హా ! ఎంత వెఱ్ఱి ! ఎంత నవీన రాద్ధాంతసిద్ధాంతము ! నయవినయధర్మంబులు నీవలన నేఁడు దానవకులంబునకు గ్రొత్తగాఁ గలుగనున్నవా ?

గీ. రాజులందు నుగ్ర • రణమందు దయయున్న
వైశ్యులందు సత్య • వాక్కునున్న
శూద్రజాతియందు • శుచియునున్న యీ
మూఁడు నసురులందుఁ • జూడఁబోము.

దైత్యదానవులకు క్రౌర్యమే విభూషణము. దౌర్జన్యమే ధర్మము. నరాశనవృత్తియే న్యాయము. శౌర్యవంతులగు మన కేడ? దయయుండు టేడ?

విభీ—క్షమింపవలయును. మహారాజా ! బ్రహ్మవంశసంభూతులము గు మనయందు దయయెప్పుడు నశించునో ఁసుజకులము న

ప్పుడే నశించును. బ్రాహ్మణుఁడు స్వధర్మమునుండి విముఖుఁడైనతోడనే సకలధర్మవినాశ మగును. వానిరాజ్యంబు కల్లోలదేవత కాస్థానమగును.

రావ—ఓరి స్వజన్మవిస్మృతుఁడా! మనము బ్రహ్మరాక్షసులముగాన బ్రాహ్మణులము కాము. నా యభ్యుదయముం గోరక వితండవాదము లాడుచున్న నిన్ను ఖరాసిఁబరిమార్చినఁ గాని యితరులకు జ్ఞానముఁ గలుగదు.

విభీ—ఆపని రామమూర్తి మిమ్ముఁ గావించునేమో యని భీతి నందుచుంటిని మహాప్రభూ!

రావ—ఏమీ? రాముఁడు నన్ను చంపునని నిశ్చయముగాఁ బలుకుచుంటివా? రాముడుఁ నన్నుఁ జంపునా? ఛీ రామసేవకా! జ్ఞాతివైరముం బూని నా నాశనముఁ గోరుచుంటివా? తులువా! సురేంద్రాదుల గడగడ లాడించిన నానోటి కెదురాడిన చండాలుఁడు తమ్ముఁడైన సరే! తనయుఁడైనసరే! నా కరవాలాగ్ని కెర గావలసినదే. వాని రక్తమాంసంబులు భూతభేతాళశాకినీఢాకినుల కాహారము జేసెద. రామవిజయమును నామరణమును సూచించిన దురాపనదు నీ రాత్రించరకొండముల యెదుటఖండించిలంకాపురీకవాటంబునఁదోరణంబుఁ గట్టెద. చనువిచ్చినకొలఁదియు, ననరానిమాటలాడిన నీవునాతమ్ముండవుగావు. నేను నీ కన్ననుగాను. నా హితమపేక్షింపక నాయొడిలోనిత్రాచుఁబాముపై నాయొమ్ముపై కుంపటివై నా నాశనముం గోరిన నిన్ను నాపాదతాడనాహతికిఁబాలుగావించి పురము వెడలింపవలసినదే! ఛీ! చండాలుఁడా! విభీషణహతకా! నా యెదుటనుండి లెమ్ము. నీ మొగము చూడఁగూడదు. లేచిపోవేని నిన్నుఁజంపుట నిజము.

## 6. అనుబంధము.

విభీ—అన్నయ్యా! మీ చెవులకుఁ జక్కని పానకము వంటి మాటలాడకపోయితినని నన్నుఁ జంపెదననుచుంటిగా! అయ్యయ్యో! ఇదేమి యవివేకము? మహాప్రభూ! ఎన్నఁడైన నన్నుఁబల్లెత్తు మాటాడి యెఱుంగుదురా? ఇన్ని దూషణంబులు మీనోట వెలువడుట మీ వినాశంబునకే యని నాకు భయంబాదవుచున్నది. లంకాపురవు విలయకాలమును సూచించి నీమహాశాపితంబులకు నాశరీర మాపాదమస్తకముగడగడవణంకుచున్నది. తమ్ముఁడను మీ శ్రేయస్సుంగోరి నీడవలె నిలచి యేవిపత్తును రాకుండ నంతరాత్మవలె బోధించుచున్నాను. నాతప్పులను క్షమించి యొప్పులనే స్వీకరింపుఁడు. మీక్షేమమును మీరాలోచించుకొనుఁడు. నన్నుఁ జంపిన జంపుఁడు. మీపాదములకడ చర్మంబు నొలిచి సమర్పించుటకే సర్వసిద్ధముగా నున్నాను. నా రాజభక్తియందు సందేహించినను సరే! నన్ను ద్రోహి యనుకొన్నను సరే! నేను మీవిలయము నాసించితిననుకొన్నను సరే! మీరు బాగుపడినఁజాలును. మీకపాయము రాకున్నఁజాలును. మనవంశమును నిర్మూలముఁజేయకుఁడు. మన పుత్రమిత్ర కళత్రములను సంగ్రామ భూమిపాలు చేయకుఁడు. దానవవంశము నరులచే నిర్మూలమయ్యెనను దుష్కీర్తి ఘటింపకుఁడు. నామనవి వినుఁడు, అంతదనుక మీపాదంబులనువదలను (పాదములపైఁబడును.)

రావ—(పాదములతో శిరముఁదన్ని)

## 7. అనుబంధము.

ఛీ! రామాభిమానీ! ద్రోహీ! లెమ్ము. నాపాదములఁ గళంక మొనరింపకుము. లెమ్ము. ఆరామునేయాశ్రయింపుము. నేను

నీహితమును వినను. నాసర్వ బంధువులు నశించిన సరే! కులము కూలిన సరే! నేను మరణించిన సరే! రాముని శరణనను. సీతను విడువను. నిన్ను క్షమింపను. ఇఁకముందు నీవు నాకంటబడినఁజంపక మానను.

విభీ — మహాప్రభూ! ధన్యుఁడను. మీపాదతాడనమువలన ధన్యుఁడ నైతిని, కాని తమదర్శనము నాకుఁదిరిగి యెట్టిస్థితిలోఁగలుగు నోయనివిచారించుచుంటిని. నాతప్పుల నన్నిఁటిని క్షమింపుఁడు. నేనుమీకిఁకేమియుఁ జెప్పదలంచుకొనలేదు. ఓసభాసదులారా! మీరందఱు నిఁకముందు దానవేంద్రుని తిండిఁ దినువారు. అతని యభివృద్ధిఁ గోరవలసినవారు అతని బ్రదుకే మీబ్రదుకు. నాహితోపదేశము నాసోదరునకు సహింపక పోయెను. మీలోనెవ్వరైన బుద్ధిమంతు లున్నచో దానవేంద్రుని ప్రాణములను రక్షించుదారిని జూడుఁడు. లేనిచో దానవేంద్రునినాశనమునిశ్చయము. నిశ్చయము.నిశ్చయము రావణరాజేంద్రా! నేను పోవుచున్నాను. సభాసదులారా! సెలవు. (నిష్క్రమించును.)

ద్విజిం — ఆహాహా! ఎంతబుద్ధిమంతుఁడు మనలనువిడిచిపోయినాఁడు? అబ్బబ్బ! ఎంత యల్లరి చేసినాఁడు. దానవేంద్రున కిప్పుడు శని వదలి నట్లున్నది.

ప్రహ — కలిపురుషుఁడవు. నీవొక్కఁడవే వదలవలసియున్నది.

రావ — సభాసదులారా! ఇంక సభ చాలింపుఁడు. నాహృదయ మీ దినమున కలతపడి యున్నది.

పరి — భాగ్యము. (అందఱు నిష్క్రమింతురు.)

ప్రథమాంకము సంపూర్ణము.

తెర వ్రాలును.

---



శ్రీ

# లక్ష్మణమూర్ఛ

## ద్వితీయాంకము.

రంగము:—సముద్రతీరము

(తెరలో)

1. అనుబంధము.

జయ! రామభద్రా! జయ! రాజీవలోచనా! జయ!

సుగ్రీ—మహాత్మా! రామభద్రా! కపిసేనలు కోలాహలము ఘోషించుచు సముద్ర సమీపంబునకు వచ్చుచున్నవి. కాలయాపనం బునకిది వేళగాదు. సేతువేయవలయును.

నీలు—(త్వరితగమనముతో ప్రవేశించి) రామప్రభో! ప్రమాదము ప్రమాదము. సుగ్రీవరాజేంద్రా! త్వరపడవలయును.

సుగ్రీ—నీలా! ఏమది?

నీలు—ఎవడో యొకరాక్షసుండు నలువురు పరిజనులతోడ నాకాశమార్గంబున మహవేగముగ వచ్చుచున్నాడు.

సుగ్రీ—ఆ! ఆ! ఏమీ! దురాత్ముడెక్కడ?

నీలు—మహాత్మా! అక్కడ అక్కడ. మేఘమార్గములందుండి దిగుచున్నాడు

సుగ్రీ—కపివీరులారా! త్వరపడుఁడు. అసురాత్ముని మార్గమధ్యంబు
ననే యెదుర్కొనుఁడు. వాని కండలు చీల్చి కాకులకాహార
మిడుఁడు. రక్తంబును బిశాచులకుఁ దర్పణము లొసంగుఁడు.
చీల్చుఁడు. ప్రేల్చుఁడు. ప్రేల్చుఁడు.

(విభీషణుఁడు ప్రవేశము.)

విభీ—రామచంద్రప్రభూ! రక్షింపుము రక్షింపుము. శరణాగతుఁ
డను. నీ కపకార మొనర్చువాఁడనుగాను. నీదాసానుదాసుఁ
డను. నీ పాదరాజీవములం గొలువ వచ్చిన భక్తకోటిలోని
వాఁడను. నీలనీరదశ్యామా! కోదండరామా! సద్గుణస్తోమా!
రిపులోకభీమా! జానకీమనఃకువలయసోమా! సంపూర్ణసోం
గర్వనిరసితసోమా! రక్షింపుము. రక్షింపుము. నా సోదరు
లగు నీకపిలోకంబు పాదంబులఁ గొలుచువాఁడ. నీసేవాకైంక
ర్యమున నీపాప జీవితంబు విడుచువాఁడ. దురాత్ముఁ డగు
మాయన్న రావణపాతకుండు నన్నుఁ దను కాలఁ దన్ని సభామ
ధ్యంబున వెడలనడచ నీశరణంబు వేడవచ్చిన దీనుండను విభీ
షణ నాముఁడను.

రాము—ఓ విభీషణా! రమ్ము. రఘుకులసంభూతుఁడ నగు నన్ను
శరణంబు వేడిన నీకు మరణం బెన్నఁడుం గలుగదు. ఫాలా
క్షుం డెదురైన నగిటుడంచి నిన్ను రక్షించువాఁడ. సూర్యచంద్ర
నక్షత్రాదిగ్రహంబులును, భూమ్యాకాశంబులును, నష్టది
క్కులును, పంచభూతములును సాక్షులుగా నిన్ను రక్షించితిని.
నీ కభయం బొసంగితి. ఈ రామబాణమే నీకు శ్రీరామరక్ష.
ఈ భుజాయుగళమే నీకు పూర్ణరక్షణము. నా యండయే
నీకు కోటయౌఁడ. కపులారా! ఈ విభీషణుండు శత్రుండనివిరో
ధింపవలదు. పరుండని తలఁపవలదు. దనుజుఁడనియును మానిపవ

దీపితాచంద్ర మైన లం ♦ కాపురాధి
కార మీ విభీషణునకుఁ ♦ గట్టువాఁడ.

కపులందఱు—జయ్—శ్రీరామచంద్రునకు—జయ్.

రాము—విభీషణా ! రావణుని వధింపకమున్నే లంకాపురాధిపత్యమును నీ కొసఁగితిని. రావణవధానంతరము నీశిరమునఁ గిరీటము గీలించువాఁడ. ఇప్పటి కీపుష్పహారముచే విభీషణ పట్టాభిషేకమహోత్సవానందము మాకందఱకుఁ గలుగుగాక (విభీషణునకుఁ బుష్పహారము వేయును. కరతాళములు.)

విభీ—ధన్యాత్ముఁడ ! ధన్యాత్ముఁడ ! రామచంద్రప్రభూ ! చరితార్థుఁడనైతిని దేవదానవ మానవాదులలో నీవంటి దయామానసాత్ముఁడు లేఁడు. నీ పాదపద్మములకన్న నాకు లంకాపురమే కాదు—స్వర్గపట్టాభిషేకమైన నానందజనకముగాదు. శత్రుని తమ్ముఁడని నిరాకరింతువని వృథాభీతితో నున్న నాహృదయమున నానందామృతాభిషేక మయ్యెను. కపివీరులారా ! విధివశంబునఁ గ్రూరదానవవంశమున జనియించిన యీ నిర్భాగ్యుని వైరియని విరోధింపక మన్నింపుఁడు. మీ కందఱ కివే పదివేల నమస్కారంబులు.

9. అనుబంధము

హను—విభీషణా!

10 అనుబంధము.

గీ. సంశయింపకుము బ్రోరా ♦ క్షసుఁడ నీవుఁ
వీరు కపులంచు నీమదిఁ ♦ విమలమైన
నీదు సద్బుద్ధి నే నెఱిఁ ♦ గితిని వాఁడె
నన్నుఁ గాల్చినయప్పుడు లం ♦ కాపురమున.

(కౌఁగిలించుకొనును).

విభీ—మారుతీ ! నీదయకుఁ గృతజ్ఞుఁడను,

సుగ్రీ—మహాత్మా ! రామప్రభూ! శరణాగతులగు వారిని రక్షించుటే నాకర్తవ్యమని మీరు పలికితిరి. సంతసం బయ్యె. కాని మహాత్మా! విభీషణునకు లంకారాజ్యంబు నిచ్చితిరి గదా! ఇప్పుడు జానకీదేవి నర్పింప రావణుఁడే వచ్చి మీకు శరణాగతుండైనచో విభీషణ పట్టాభిషేకము నుపహరించుకొందురా?

రాము—సుగ్రీవా ! ఎంతవెఱ్ఱివాఁడవు! రావణుఁడే నాకు శరణన్నచో నాతనికి నాయయోధ్య నిచ్చి నేను పర్ణశాలలోఁ గాఁపురముండనా ?

సుగ్రీ—ఓహో ! కపులారా ! వింటిరా ! రామచంద్రమూర్తి సౌజన్యము; రామచంద్రమూర్తి యాశ్రితవాత్సల్యము; రామచంద్రమూర్తి శరణాగతరక్షణాసక్తి.

రాము—సుగ్రీవా! కానికేమి గాని మనము సముద్రము లంఘించుటకుఁ దగిన ప్రయత్నంబు లాచరింపుము.

సుగ్రీ—మహాప్రభూ ! సర్వసన్నాహమై యున్నది. కపులందఱును పర్వత, వృక్ష, శిలాదులతోడ సిద్ధముగా నున్నారు.

రాము—మనమందఱము సముద్రుని బ్రార్థింతము.

(రాముఁడు దర్భశయనమున నుండును. సముద్రము కనఁబడును)

అందఱు—

11 అనుబంధము.

రాము—హే రత్నాకరా ! సమస్తప్రాణిలోకాధారా ! దుష్టరావణ హరణార్థము చనుచున్న మాకు దారి నిమ్మా. మమ్ము రక్షింపుము. (సముద్రము పొంగుచున్నది).

సుగ్రీ — మహాత్మా! ఏమి యిది? సాగరము మనపైకి మఱింత విజృంభించుచున్నది. ఏది మార్గము?

రాము — (కోపముతో) ఓరీ! సాగరచండాలా! ఏమిరా కండకావరము! సామ్యంబునఁ బ్రార్థించినకొలఁదియు మిడిసిపడుచున్న నిన్ను నాశరకాండములచే బంధించి మఱి లఘించెదఁ గాక!

## 12 అనుబంధము.

ఓరీ! దుర్మతి! రామబాణదమనోద్యోగంబు నూహింపకే
ధీరత్వంబున పొంగు నిన్ను భయవద్వృత్తిం జేసి పోగాల్చి నీ
పారావార మతిక్రమించెదను గర్వం బెల్లఁ దూలించెదన్
శ్రీరాముం డనను నేమిగాఁ దలఁచితో ధీ! వార్ధిదేవాధమా!

(అని శరంబు నెత్తగా) (సముద్రుఁడు ప్రత్యక్షమై)

## 12 అనుబంధము.

సము — రామచంద్రమూర్తీ! శాంతింపుము. శాంతింపుము. అమోఘంబగు నీబాణంబు ననాథుఁ డనగు నాపై నెత్తకుము. నిన్ను సందర్శించిన మహానందంబున నుప్పొంగితిఁ గాని విరోధంబునఁ గాదు. నా యపరాధంబులను మన్నింపుము. విశ్వకర్మనందనుఁడగు నలునిచేఁ బర్వతంబుల తెక్కించి నా కుపకారుఁడగు సేతువుచే నన్ను బంధింపఁజేసి శీఘ్రముగా లంకం జేరి దురాత్ముండగు రావణుని వధించి జయము నొందుము. నీకుఁ గల్యాణమగుఁ గాక! రామచంద్రా! నాకు సెలవు. పోయి వచ్చెదను.

(నిష్క్రమించును)

(కపులు సాగరమును బంధించి దాఁటిపోవుచున్నారు)

తెరవ్రాలును.

## ౨ వ రంగము — రాజవీధి.

(ద్విజింహ ప్రహస్తులు ప్రవేశము)

ప్రహ—ద్విజింహా! ఈ వింత వింటివా?

ద్విజిం—ఏవింత? సముద్రముపైఁ బర్వతములు దేలుటయే కాదా! ఆఁ! వింటిని. ఇంతకుముందే!

ప్రహ—అదికాదోయి! అంతకన్న పెద్దవింత. వింతకన్నవింతా!

ద్విజిం—ఏదా వింత?

ప్రహ—చుట్టుప్రక్కల నెవ్వరును లేరుగదా! బిగ్గఱఁగాఁ జెప్పఁగూడని వింత. రాజద్రోహములలోఁ జేరిన విషయము.

ద్విజిం—ఎందులకు?

ప్రహ—మన రావణరాజేంద్రుని సుగ్రీవుఁడను కోతిరాజు వచ్చి పండ్లు విఱుగఁదన్నినాఁడు.

ద్విజిం—ఆ! ఆ! నిజముగానా? అట్లయిన నీవిపుడు మింతరహస్యముగాఁ జెప్పినదేమి?

ప్రహ—వెఱ్ఱివాఁడా! నాలుకపై జీడివలె గొప్పవారి యవమానము పొక్క ననుకొంటివా?

ద్విజిం—నేనిది నమ్మలేకున్నాను. ఎట్లుతన్నినాఁడు? ఏమి జరిగినది?

ప్రహ—కపిసైన్యము సువేలాద్రిప్రదేశమున విడిసియుండఁగా రావణాదులు కోటబురుజుపై విచిత్రముగాఁ జూచుచుండిరి. ఆ తరుణమును గనిపెట్టి సుగ్రీవుఁడు గోపురముపై కెగిరి రావణుని కిరీటములు దపయు, భుజకీర్తు లిరువదియు భూమిపైఁ బడునట్లు తన్నెను.

ద్విజిం—సెబాస్! ఆసమయమున రావణుని నేను చూచియుండినచో నేని యొక పెద్దప్రబంధము వ్రాసియుందును గదా.

మని పలుకుచు, మీ పరాజయమున నర్థాంగీకారమును సూచించుచున్నాడు.

రావ — ఆతని మాటలతో నేమి? ద్విజిహ్వా! మఱొక ప్రక్రియం దెలుపుము.

ద్విజిం — మహాప్రభూ! చిత్తగింపుడు. పగలు కేకవేసిన గ్రుడ్లగూబను పట్టితెచ్చి దానిచేబల్లిని తినిపించి దాని యమేధ్యమును వలచినవారు వలపుకత్తె నెత్తిపైనయిదునిమిషములు రాయువలయును.

రావ — బాగు. బాగు. నీప్రక్రియ నెఱవేరు టెంతసంభవమో, నేనామెనెత్తిని రాయుటయు నంతయసంభవమే!

ద్విజిం — (అ-) మీరు రాయుట యసంభవమేమి మహాప్రభూ?

ప్రహ — తెలిసికొంటివానీడ్రా! ఇష్టములేని కాంతల నంటినమరణింతువని యీరునకు శాపమున్నది గదా!

రావ — హా! సీతా! సీతా!

గీ. బహువిధములచేత వంకజాసనుని మె
ప్పించినాడను గాన్పి భజించుచుబోడి!
అనయమును స్మరించెదను గాని నాపైనం
గరుణరా దదేమి కాంతబో?

(తెరలో)

మహాప్రభూ! జాగ్రత్త!

రావ — ఆ! ఎవడురా అది?

(తెరలో)

ఒక పిల్లకోతి యూకాశమార్గమున దిగి దేవరసభలోనికి వచ్చుచున్నది.

(అంగదుడు ప్రవేశము)

14 అనుబంధము.

రావ — రాత్రించరులారా ! చూచెద రేమి? వీనినిఁ బట్టుకొనుఁడు. కొట్టుఁడు. చంపుఁడు.

ప్రహ — ఒక ముండకొడుకు వచ్చి మాకొంప లంటించిపోయినాఁడు. ఇప్పుడు నిన్ను వేడి పెనముపై వేయించుకొని తినకపోముకే.

ద్విజం — వహ్వా! వహ్వా!! మర్కటకాసుశ్వరీలేహ్యము చేయుటకై యెన్నినాళ్ళనుండియో కాల యాపన మగుచుండెను. ఇప్పుడు మంచికోఁతి దొరికినది. మహాప్రభూ ! ఈకోఁతితో నాలేహ్యము చేయించుకొని వాడితిరా సీత రెండునిమిషములలో చేఁజిక్కును.

మహా — రే ! మర్కటాధమా ! నీవును రామసేవకుఁడవేమో చెప్పుము నీపనిఁదూల్చి భైరవపూజచేయుదును.

దీర్ఘ — యోధానుయోధులచే నిండి భయంకరమైన లంకాధినాథ సభామంటపమధ్యమునకు మరణము నాసించి వచ్చితివేఁటరా జ్ఞానహీనుఁడా !

రావ — ఓరి ! నీ వెవ్వఁడవు? నీ పేరేమి? మాటాడవేమి?

అంగ — రావణా ! గవ్వపనిచేయని యీ కొరమాలినదండును, యీ విగ్రహపుష్టిగల పెద్దమ్మలను, యీ తిండిదండుగ వినాయకులను, యీ మొరుగుకుక్కలను, యీ బోడురుకప్పలను నీ వెక్కడ సంపాదించితివి? వీరందఱితోడనేనా రామవిజయమునకు బయలుదేరునది?

రావ — ఆ! ఏమిరా నీ వాచ్ఛటికము. ఏమిరా ! నీ గర్వభావము నీవు రాముని బానిసవేనా? వీరందఱును నీకంటెకెఁ బనికిమాలిన చెత్తగాఁ గాన్పించుచుండిరేమి? ఎంతపనికిమాలిన చెత్తయైనను కోఁతులు గారు గదా ! కొండముచ్చులు కారు గదా! కాయలు తిని బ్రదుకు పశుప్రాయులు కారు గదా ! ఈవీరు

లందఱును కోఁతులను గెలువనేరననుకొంటివా?

అంగ — ఛీ! దానవాధమా! ప్రేలకుము. రామ సేనాసామర్థ్యము నెఱుంగఁదలంచినవాఁడ వింత తొందర పడెదవేమి?

కోఁతియే సుమి! నిన్ను నా వాలమునఁ జుట్టి
ముమ్మారు వార్ధిలో ముంచియెత్తె
కోఁతియే సుమి! లంకఁ గాలుకొమ్మలఁ గాల్చి
పలువ రాక్షసకోటిఁ భంగపఱచె
కోఁతియే సుమి! నీ కుమారుని వధియించి
శ్రీరామముద్రిక సీత కిచ్చె
కోఁతులే సుమి! మహాకోలాహలంబున
నంచితవార్ధి లంఘించి మించె

గీ. కోఁతియే సుమ్ము పుడు నిరంకుశత నీకుఁ
జోద్యము భయంబుఁ గలిగించుచున్న వీఁడు;
కోఁతులే నిన్ను మొదలంటఁ గూల్పఁగలరు
కోఁతిసామర్థ్య మెఱుఁగవో కుటిలబుద్ధి.

అజాగళస్తనములవలె నాకారమునకే గాని యవసరమునకుఁ బనికిరాని యీ పనికిమాలిన రాక్షసదండును రామదండుతోఁ బోల్చుచుంటివా రాక్షసాధమా? రామానుచరులకును రావణానుచరులకును స్వర్గ పాతాళంబులకుఁ గల దూరముగాదా?

## 15. అనుబంధము.

రావ — ఓరీ మర్కటాధమా! నీవు రాజసభాధర్మంబుల నెఱుఁగని యనాగరికుఁడవు గాన నీ మర్యాదావిరహితసంభాషణంబులను మేము సరకుచేయము. నీ పేరేమి?

అం — దానవకులపాంసనా! ఔను, నీవు నిక్కమే పలికితివి. మేము

దానవసభాధర్మముల నెఱుంగనిమాట నిక్కమే! అయినను ప్రతిపక్షుండ వగు నీవు నా పేర నడిగితివి గాన వినుము.

గీ. ఎఱుఁగుదువు గద! వాలి న ♦ హీనబలుని
నతని పుత్త్రుఁడ నంగదా ♦ హ్వయుఁడ నేను
పావనుండగు రఘురాము ♦ బంటు నగుచు
దివ్య సందేశ వార్తను ♦ దెచ్చినాఁడ.

రావ—(ఆతురతతో) ఏమీ! అంగదుఁడవు నీవేనా?

ద్విజిం—ప్రహస్తా! రావణరాజు అంగదుఁడవు నీవేనా? నీవేనా? యని, యంత నాత్రముతో నడిగె నేమి?

ప్రహ—వీఁడు ఘుందోదరిని బెండ్లాడెను.

ద్విజిం—అధపుత్రుఁడగు క్షేత్రజునియం దభిమాన మేమి?

ప్రహ—అభిమానము గాదు. అవమాన మగునని భీతి.

రావ—ఓరి వైరిరాజాభిమానవిద్యాపారంగతా! అంగదా! నీప్రత్యక్షవైరియగు రామునకు దాసుఁడవై యది చాలక కులాభిమానములను తృణప్రాయములుగా విసర్జించి నాకడ రాయబారమును నడుపవచ్చితివఁట గా!

అంగ—రావణా! రాముఁడు నాకు ప్రత్యక్షవైరి యెట్లు?

రావ—ఎటులనా? నీ వెఱుఁగవా?

సీ. నీ పినతండ్రియా ♦ నీచు సుగ్రీవుని
ప్రోత్సాహమున నతి ♦ ద్రోహి యగుచు
జెట్టుచాటునఁ దోఁటఁ ♦ జేరి నీతండ్రి నే
కాశుగాహుతిచేత ♦ హతునిఁ జేసి
నీ వందఁదగిన యా ♦ నిఖిలరాజ్యాధికా
రమ్మునకు సుగ్రీవు ♦ రాజుఁ జేసి

నిర్భాగ్యు నొకరి చి • కిత్సింపఁ జూచిన
పాపాత్ము పాద ఖల్ల • బట్టె వాస

గీ. విష్ణువంచును పూజించి • నెకిలి నగుచు
తచ్ఛరణములు గడిగి తీ • ర్థంబుఁ ద్రావ
దలఁచినాఁడవో కింకిరం • హా! యింకేమ
టంచు నాకడ కిటుల నే • తెంచినావు.

అంగ — దానవనాథవరా! నీ యుక్తి నే నెఱుంగుదును. నీ హితోపదేశమును నే నెఱుంగుదును. నీ యుపవంచనమును నే నెఱుంగుదును. నీ యవ్యాజకరుణానుగ్రహమును నే నెఱుంగుదును. నీభేదోపాయము నిటులుంచి, సామోపాయంబున నుత్తరమిమ్ము. తెగనాఁగక శ్రీరామచంద్రమూర్తి సందేశము నాలకింపుము.

రావ — ఎట్లు?

అంగ — "రావణా! బ్రహ్మబంధూ! లంకాధినాథా! నీవు జన్మంబున నుత్తమోత్తముండవు. అయినను రాక్షసస్వభావంబు లవలన చెడితివి. సాధ్వియగు నా పత్నిని సీతను దొంగిలించికొని చన్న నీకు పశ్చాత్తాపంబునఁ బ్రాయశ్చిత్తము కాఁగలదు. ఇప్పటికైన విజ్ఞానివై పరనారీలోల దుష్టబుద్ధిని మాలించుకొని మత్సన్నిధికి సీతం గొనితెచ్చి సమర్పింపుము. కానిచో మన యిరువురి నడుమ మహాసంగ్రామము ప్రవర్తిల్లు. అందు పాపకార్యములే నిన్నుఁ బీడింపఁగల నీకు విజయంబు గలుగుటరుదు. చేతులార లంకారాజ్యమును నాశనము జేసితివేని నీ తమ్మునికి రాజ్యపరిపాలనంబునకు శ్మశానము నప్పగింతువేమో యని విచారించువాఁడను. దూరమాలోచింపుము," అని శ్రీరామచంద్రమూర్తి మీతో వచింపుమనెను.

రావ — ఆ! ఏమి రాముని గర్వాలాపములు? తనవిజయమును తా నప్పుడే స్థిరపఱచెనుగా!

అంగ — తన విజయమును, నీపరాజయమును సీతాపహరణ కాలంబునఁ గాలమే నిర్ణయించినది. ధర్మాధర్మ సంగ్రామ ఫలిత మిప్పుడు క్రొత్తగా మనము నిర్ణయింపవలసిన దేమి?

రావ — ఆఁ అటులనా? అట్లు నీనోట రాముఁడు పాటఁబంపె నేమి?

అంగ — ఓరీ మందమతీ! నీబుద్ధి యిట్లేలో నున్నదా!

సీ. లేడివై పొమ్మన్న ♦ వాఁడు మారీచుఁడు
న్యాయబోధను నీకు ♦ సేయలేదె?
దొంగిలించిన నాఁడు ♦ మారీచుం బిడియటంచు
నల జానకీదేవి ♦ తెలుపలేదె?
లంకఁ గాల్చిననాఁడు ♦ శంకర మారుతి
చెలఁగు నీకిదియంచుఁ ♦ జెప్పలేదె?
కాలఁ దన్నిననాఁడు ♦ ఘనుఁడు విభీషణుం
డలయక నఘమంచుఁ ♦ బలుకలేదె?

గీ. అనుజుఁడగు కుంభకర్ణుఁ డీయంత ♦ రాత్మ లేదె
పాపమని యెల్లకాలంబుఁ ♦ బలుకరాదె?
ఫాలమున విధి నీమృతి ♦ వ్రాసియుండ
నిపుడు నానోటఁ బల్కించు ♦ టేల తులువ?

రావ — చాలు! అంగదా! నీ యుపన్యాసమున కంద మానందించి నారమతే. వాలిపుత్రుఁడవగు నీకుమతిలేదా? సందేశమంపిన రామునకు మతిలేదా?

అంగ — ఏమి?

రావ — నా యనంతరము నా రాజ్యమునకు నచ్చు నాత్ముఁడెవఁడు?

అంగ — నీతమ్ముఁడు రామపక్షమున జేరిన నీతమ్ముఁడు. మరచితివా?

రావ—హ్హాహ్హా!! మా విభీషణయ్యా హూం?

అంగ—విభీషణమహారాజనుము

రావ—ఏమి? విభీషణుఁడు మహారా జెట్లగును? ఒకవేళ నే నంతరిం తునేయనుకొన్నను నా పుత్రుఁడు మేఘనాధుఁడు రాజగును గాని విషపురుగగు విభీషణుఁడు రాజగునా?

అంగ—మేఘనాధుఁ డెక్కడ? ఈలోపల నే లక్ష్మణునిచేతనో చావక మిగిలినమాట గదా!

రావ—ఛీ! ఎంత మాటాడితివి? నా మరణముతో బాటు నా కుమారుని హత్యయు సూచింతువా తులువా? విభీషణుఁడు తిరిగి లంక లోఁ గాలుపెట్టఁగలఁడా?

అంగ—ఓరీ! వాగాడంబరశూరా! విభీషణుఁ డెప్పుడో రాజగుట గాదు. ఇదివఱకే యైయున్నాఁడు.

ఆ. తన్ను వేఁడి శరణ ♦ మన్న విభీషణు
భయము వాపి యభయ ♦ పాణిఁ జూపి
యా దినేశచంద్ర ♦ మైన లంకాధికా
రంబు నొసఁగెనయ్య ♦ రాక్షసేంద్ర!

రావ—హాహాహాహా! వింటిరా సభ్యులారా? వింటిరా? ఈవింత వార్త అబ్బ! కోతిమూకలమె చుట రాముఁ డెంతవదాన్యతను గన బరచెను. తన్ను రాజ్యమునకుఁ బాపి సవతితల్లి యడవులకుఁ గొట్టినను లజ్జలేక రాముఁడు పరులరాజ్యములను బరులదా యాదులకుఁ బంచియిచ్చుచుండెనఁట. వింటిరా! హాహాహాహా!

అందఱు—హాహాహాహా!! (నవ్వుదురు.)

అంగ—సభ్యులారా! ఏటికీ కాకిగోల? రావణా! కేవలమీశక్తి దుర్జనత్వమును వెల్లడించు నీ తెలివిమాలిన పలుకులం గట్టి పెట్టి నా హితంబును వినుము. రావణరాజా! నీకు బ్రహ్మ

# తృతీయాంకము.

సరమాదేవి మందిరము.

[సరమాదేవి, త్రిజట ప్రవేశము.]

## 17. అనుబంధము.

త్రిజ — నాయనగారు మమ్ము విడచినాఁది, మాయమ్మ సరమాదేవి మంచముఁ బట్టియున్నది. నాలుగు దినములనుండియు, నొకే రామస్మరణముఁ గావించుచున్నది. దుష్టదానవసమాకీర్ణమగు లంకాపురమున రామశబ్దోచ్చారణము పరమద్రోహముగదా? మా యన్న మేఘనాథుఁ డీవార్త వినెనేని, కసుగుప్పగును. నాయనగారు రామసన్నిధిం జేరి. పెదతండ్రిగారగు దనుజేశ్వరుఁడు, మమ్ములను శత్రులుగా భావించుచున్నారు. ఇఁక మా కీయూర నెక్కడివారు ? మిత్రులెక్కడివారు ?

సర — బిడ్డా ! త్రిజటా !

త్రిజ — అమ్మా ! ఏమి ?

సర — ఇంకను నూరకుంటివేమి ? లెమ్మా. శీఘ్రముగా లెమ్మా.

త్రిజ — అమ్మా! ఎందులకు ?

సర — ఎందులకని యింక సావకాశముగఁ బ్రశ్నించెదవేమమ్మా ! లే శీఘ్రముగా లే ! నవరత్నఖచితమై ముత్యాలపరువులు గలిగి శ్వేతచ్ఛత్రశోభితమైన సింహాసన మొక్కటి మధ్యమున నుంచుము. దానికి నిరుప్రక్కల మరియొక రెండాసనము లుంచుము. నవరత్నసింహాసనమున కెదుట నొక చిన్న [illegible]

బరచి దానిపైఁ బరిమళద్రవ్యసంయుక్త దివ్యచందనతాంబూలములనుంచుము. చక్కని పన్నీరుబుడ్ల నమర్పుము. మల్లె మొల్ల విరజాజి దండల మెండుగా నుంచుము. శ్వేతనీరాజనమును వెలిఁగించి నివాళింప సిద్ధముగా నుంచుము. లెమ్మా. ఆలస్యము చేయకు.

త్రిజ— అమ్మా! అమ్మా! ఏమిది? ఇట్లు మాటాడెదవేమి? ఇప్పుడివియన్నియు నెందుకు?

సర— అమ్మా? ఎందులకో తెలియదా? బిడ్డా? ప్రేమమ్మా! రాక్షసకులమునఁ బుట్టినంతమాత్రముననే మన నొసట నధోగతి వ్రాయఁబడి యున్నదా? నీతండ్రిగారు రామచంద్రపాదరాజీవసేవాపరతన్ ; దివ్యపదలాభమునంది, ధన్యులగుటఁ గాంచవా?

త్రిజ— అట్లనమ్మా! ఇప్పుడు సింహాసనాదు లెవ్వరికొఱకు?

సర— శ్రీరామచంద్రమూర్తిని, ఆయనతమ్ముని లక్ష్మణుని, రామభక్తసన్నుని హనుమంతుని గొని నీతండ్రిగారు లంకకు వచ్చినారు. అమ్మా! లంకలో శ్రీరామపట్టాభిషేక మగునని.

త్రిజ— అమ్మా! చాలు! చాలు! ఏమిది? రామలక్ష్మణు లెక్కడనున్నారు? తండ్రిగారెక్కడనున్నారు? ఆంజనేయుఁడెక్కడనున్నాఁడు? నీవు కేవలము కలువరించుచున్నావమ్మా!

సర— బిడ్డా! నేను కలువరించుట లేదమ్మా! కాని నాకన్నుల కెదుటఁ జూచినపట్టాభిరామచంద్రమూర్తియే కాన్పించుచున్నాఁడు చూడు! శ్రీరామమూర్తి మనయింటికి రాలేదనిపలికెదవేమి? అదిగో! రామమూర్తి! ఇదిగో! రామమూర్తి! ఇక్కడ! అక్కడ! అదిగో! జయ రామచంద్రపరబ్రహ్మకు జయ్

18 అనుబంధము.

త్రిజ—హా! హా! ఏమి యున్మాద మిది? ఏమిచేయుదును ? ఎవరిని వేడుదును ? ఎవరు దిక్కు? అమ్మా! అమ్మా! ఏమమ్మా ! నీ విట్లు పిచ్చిదానవైన నాకెవ్వరు దిక్కు ? తల్లిదండ్రులు లేనినాబ్రతుకు కేల ? అమ్మా !

సర—బిడ్డా ! చూడు. ఏడువకు. మనకు రామచంద్రమూర్తి కన్న వేరు దిక్కెవరు ? సదా రామతారకమే మనకు శ్రీరామ రక్షయై వెన్నంటి కాపాడునమ్మా! స్మరించుకొనుము. రామ తారకమును స్మరించుకొనుము. రామ-రామ రామ-రామ.

త్రిజ—రామ-రామ-రామ-రామ.

(సులోచన ప్రవేశము.

సులో—వదినా! త్రిజటా! అత్తా! సరమాదేవీ! మీరిచ్చటనే యుంటిరా! జాగ్రత్త! జాగ్రత్త! ఒక్కక్షణము రామనామస్మరణము మానుడు

సర—ఆ! ఏమి? బిడ్డా!సులోచనా! ఇటువచ్చికూరుచుండుము. మన మిప్పుడు రామనామస్మరణమేల మానవలయు? అంతకన్న జీవితమే మానుట సర్వోత్తమము గాదా? ఛీ! ఛీ! ఇదివఱకుం దెలియక చెడితిమి. ఇంకముందుసైత మిట్లే చెడవలసినదా? సులోచనా! చూడు, నీమగం డింద్రజిత్తు నా కన్నులయెదుటి బాలుండు. వాని కేమి తెలియును ? నీవును వెఱ్ఱిమాటలాడెదవా ? చూడు! బిడ్డా! పిపీలికాదిబ్రహ్మపర్యంత చరాచరములయందును నిండినయాపరబ్రహ్మమూర్తి మనదివ్యభాగ్య

విశేషమునలంకాపురమునకువచ్చుచున్నాఁడు. ఈతరుణమునం బోగొట్టుకోఁ గూడదు. నా నాథుఁడు విభీషణమహారాజు చల్లఁగా శ్రీరామపాదరాజీవములఁ జేరినారు. ఇదిగో! నాబిడ్డ త్రిజట! రామనామామృతాస్వాదనమున వివశయై యిచ్చట నున్నది. నీవును రామతారక మేమరకుము.

సులో — అత్తా! సరమాదేవీ! నీపలుకులయందలి పరమార్థము నెఱుంగు నదృష్టము నాకు లేదు. ఆఁడుపుట్టుక పుట్టినదాని కాత్మేశ్వరుని యనుకరణమే పవిత్రము. నా నాథునకు వైరియగు రాముని నేను గొలువఁజాల! అయినను నీవు దోషివి కాఁజాలవు. రామచంద్రమూర్తి పాదములం గొల్చిన మామగారు విభీషణులను పరమపతివ్రతవై యనుకరించిన నీవు సాధ్వీమతల్లివి.

సర — బిడ్డా! మంచిదమ్మా! బుద్ధిమంతురాలవు. అట్లయిన నీ విప్పుడిటకేల వచ్చితివి?

సులో — నేఁటియుదయమున హృదయేశ్వరుఁడు మాయరామలక్ష్మణులను సృష్టించి సీతను దుఃఖింపఁజేసి, రామస్మరణము లంకలో వినంబడిన, నవ్వారిని ఖరాసిపాలుఁ జేసెదనని తీవ్రప్రతిజ్ఞులై తిరుగుచున్నారు. మీకేదైన నపాయము సంభవించునను భీతి గల్గి యిటు వచ్చితిని. రామస్మరణము మానుఁడు. తల్లీ! నా మనవి వినుఁడు.

సర — అమ్మాయీ! ఎంత వెఱ్ఱిదానవమ్మా! రామచంద్రమూర్తి యన నెవ్వరను కొంటివి? ఇటు వినుము. భరతువంటివాఁడు ఆమహానుభావుని పాదుకలను శిరమునఁ దాల్చి గాని, రాజ్యమొనరింపనని పట్టుఁబట్టెను. తెలిసినదా? బిడ్డా! దొంగపోటునఁ గనతండ్రిని జంపినదైన మదినిదలంపక అంగదుఁడా సర్వేశ్వరుని పాదంబులఁ బట్టెను. వింటివా? కుమారీ! పదునాలుగు జగ

బులను లెక్కసేయని ఘోరుతి యీ పరమాత్ముఁడు దక్క వేఱురూపము తన యాత్మయందు లేకుండఁ జేసికొనియెను. అప్రమత్తవై యుంటివా? తనయా! వేయేల? నీచినమామ గారు శత్రుపక్షంబనియైన గణింపక నాదేవునిఁ గొలుచుచుండుట లేదఁటమ్మా? ఆపావనాక్షరస్మరణంబున శరీరము పులకితమగుచున్నది. మేను మఱపునకు వచ్చుచున్నది. కన్నులలో దివ్యతేజముఁ గానిపించుచున్నది. ఆత్మగథం బాకాశమార్గమున సంచరించుచున్నది. సులోచనా! నీవు సులోచనవైనందులకు ఫలితం బెప్పుడు కలుగునో సుమా! బిడ్డా! రామనామప్రభావంబు నెఱుంగుము. ఆత్మజ్ఞానంబు సందుము. సర్వాంతర్యామి రామనామము. సర్వజీవనాధారము రామనామము. సర్వలోకానందధామము రామనామము. సుమమనస్సమూహసంపూజిత కారుణ్యామృతము రామనామము. త్రిదివాంచితనిక్షేపము రామనామము. బ్రహ్మాండమండిత మహాతేజోభిరామము రామనామము. రామా! రామా! రామా! రామా! బిడ్డా! బిడ్డా! త్రిజటా! అమ్మా! సులోచనా! మీరెచ్చట నున్నారు? ఇటు వినుఁడు, నేను సరమను గామ్మ, మీరు రాక్షసులు కారు ఇది లంకాపురము కాదు. ఆహా! బిడ్డలారా! అవధారు. అవధారు. అద్వైతంబగు భక్తి చేఁజిత్తమును, దృఢముగా బంధింపుఁడు. త్రిశరీరాతీత రామనామంబు భక్తజనకర్ణామృతంబు శరీర ముప్పొంగి రోమాచలంబులు గగుర్పొడిచి, పవనపంచాలంబున మృదుపుష్పసమన్వితవల్లికాకుంజముగతి కంపించుచున్నది. కన్నుల నానందబాష్పసందో

హంబు గంగార్ఝురీప్రవాహసంకాశమై ప్రవహించె. హృదయ
మమృతవర్షంబునకుఁజక్కెరబొమ్మ కరఁగునట్లు కరంగుచున్న
ది రాముఁడుదివిజాళి గాముడు. సుగుణసంధాముఁడు జానకీమనః
కువలయసోముఁడు. ఆ రాముని గొలువుఁగొలిచి తరింపుఁడు.
అమ్మాయీ! అతఁడు మనుష్యుఁడు కాఁడు. కాఁడు. సీతమగ
నిఁజాసిన దిక్కుమాలినయంగన గాదు, వింటిరా! మనదానవ
కులనాశని యగు శక్తి. రామమూర్తి యాదినారాయణుఁడు.
క్షీరసాగమునందు శేషాహితల్పంబునం బవ్వళించిన నారా
యణమూర్తి. ఆదిలక్ష్మిసీత-లోకమాత. జయ-రామచంద్ర
మూర్తికి జయ-బిడ్డలారా! ఎక్కడ? ఎక్కడ? నాకన్నులలో
నేదో కాంతి గ్రమ్మినది. మీరు జాగ్రత్త. అదిగో! రామ
మూర్తి- కాదు- నారాయణమూర్తి. జయ రామచంద్ర
మూర్తికి- జయ్.

(సరమ మూర్ఛిల్లును. క్షీరసాగరము కనఁబడును. ఆ కాంతికి సులోచన
త్రిజట మూర్ఛిల్లుదురు. తిరిగి క్షీరసాగరము మాయమగును.)

(ఇంద్రజిత్తు ప్రవేశము)

(19 అనుబంధము)

ఇంద్ర—ఛీ! ఛీ! నా చెవులకు వినఁబడునవి పలుకులో ములుకులో! ఆ
నీచరామశబ్దంబును దిక్కులు మారుమ్రోగ స్మరించు జ్ఞాన
హీను లెవరు? దనుజపురంబగు లంకయం దిట్టి యకృత్యం
బాచరించి చావఁదలఁచిన మందభాగ్యు లెవరు? ఆ పరమనీ
చులు బంధువులైననసరే! మాతృదారాసోదరీ విభేదంబు నెం
చక వధించెద. (రెండడుగులు నడచి) ఆ! ఏమిది? ఇది కలయా?
నిక్కువమా? ప్రాణేశ్వరి సులోచనయా? పిన్నమ్మగారు సరమా

దేవియు, సోదరి త్రిజటయు మూర్ఛిల్లియున్నారే! ఇదేమి చిత్రమోకదా! వీరి, నేరామబాణపలయిన బాధించియుండరు గదా? ప్రియా! సులోచనా! పలుకవేమి?

సులో—(లేచిఆవేశముతో) రే! గ్రాతించరులారా! రే! దివిజవిద్రోహులారా! నిలుఁడు. భయంకరముగా నెత్తినబ్రహ్మాస్త్ర మిదిగో!

ఇంద్ర—(వెరఁగుపడి)ఆ! ఏమిది? ప్రియా!ప్రియా!సులోచనా!సులోచనా! (పట్టి యూపి) ఏమిది? అట్లు కను లెఱ్ఱజేసి నావంకఁ జూచెదవేమి? ఆ యార్భాట మేమి? బ్రహ్మాస్త్రమేమి? ఉన్మాదిని వైతివా? ఇటు చూడు. నేను నీపతినగు మేఘనాధుఁడను.

సులో—హా! మేఘనాధుఁడు! జానకీకేశాంబరాకర్షణమహాపాపి! మేఘనాధా! ప్రచండభండనంబున నీప్రతాపము. నాయెదుట సాగదు రే! నేను లక్ష్మణుఁడనురా! శ్రీరామసోదరుఁడ. మేఘుఁబుం దాగిన సరే! నికుంభిలాహోమము మొనరించిన సరే! నిన్ను వధింపక మానను! నావధూనికను విడిపింపక మానను. పిఱికిపందయగు దేవేంద్రుఁడు కాఁడు. శ్రీరామానుజుఁడు లక్ష్మణుఁడు. నిలు! (మీఁదికి వచ్చును.)

ఇంద్ర—ఛీ! దురాత్మురాలా! నీవు లక్ష్మణుఁడవా? నీకపటం బెఱుంగుదును. సరమమూలంబున మతిచెడి యీకపటాభినయముం గావించెదవా? నిన్ను ఖండించెద నిలువుము (కత్తి నెత్తును.)

సులో—(మూర్ఛిల్లును)

ఇంద్ర——(తనలో) తొలుత నీ సరమా త్రిజటల ఖండించిన నీసులో చనదారికి రాఁగలదు! (ప్రకా) ఓసీ కులద్రోహీ! సరమా! తల్లి వనినిన్నుఁ గనికరింపను! ఆరామ బాలిశునిఁ గొలువఁబో యిన దురాత్ముఁడగువిభీషణుని పత్నిని నిన్ను బ్రతుకనీయఁగూడదు. మీరెన్నినిమిషము లీలంకలో సజీవులయియున్న మాకంత ముప్పగును, నీకంఠము నుత్తరింతును.

సర——హా! కుమారా! మేఘనాథా! చ పుము. నాయనా! చంపుము ఒక్కవ్రేటున రెండు తునకలగునట్లు ఖండింపుము నాకింత కన్న నుపకార మింకొకరు చేయలేరు. పతిని బాసిన నాకింక మృతిదక్క వేరుశరణ్య మేమున్నది? ఇదిగో! కంఠము చూ చెద వేమి? రామా! రామా! రామా!

సులో——నాథా! నాథా! ఇదేమి ఘోరకర్మము? తల్లినిజంపఁ బాలు పడుచుంటిరేమి? శాంతింపుఁడు. శాంతింపుఁడు. (పట్టుకొను చున్నది.)

ఇంద్ర——(కాలితోఁదన్ని) ఛీ కులటా! మీమహామాయామంత్రము నెఱుంగఁజాలని మందుఁడనని తలంచితివా? దూరము గానుం డుము. సతివని కనికరమింక లేదు. మాతయని మమత యింక లేదు. సర్వనాశనముఁ గావలసినదే! దారుణంబగు చరిత్రహా సముఁజూడుము.

సర——అమ్మా! సులోచనా! ఏలవారింతువు? చంపనిమ్ము. రామా! రామా! రామా!

సులో——నాథా! ఇంతటి దారుణముం దలపెట్టితిరేమి? ఆమె మీ తల్లిగారు గాదా? ఏమొనర్చిరి?

ఇంద్ర——ఓసీ! ఇంద్రజాలికురాలా! నేనింద్రజిత్తును సుమా! నాకడఁ [illegible]నాటక మాడెదవా? సూత్రధారీ! ఒక గడియకిందట లక్ష్మణశైలూషవేషముఁ బడితివే! మఱచితివా?

సులో—(తెల్లఁబోయి) నాధా! ఏమిది? నేను మీపైఁబడితినా? ఎందుల కీయన్యాయము? ఏమి యపచారము? నాధా! మనోవాక్కాయకర్మంబుల మిమ్ము వినా యితరులను దలంపను. మీరే నాదైవము. నేను మీయం ద్రోహముం దలఁచి యెఱుంగను. నాపై నాగ్రహించిన నే నెందుఁబోవుదానను? లక్ష్మణశైలూషత యేమి? కపటనాటక మేమి? జరుగుచున్న ఘోరసంగ్రామ మేమి? నిష్కారణముగ మీరిట్టిఘోర కార్యంబులనొనరించుట యేమి? జననీసమానయగు పూజ్యురాలు సరమాదేవిపైఁ గత్తి నెత్తనేల? నన్ను ఖండింప సమకట్టనేల? ప్రాణేశా! రక్షింపుము.

ఇంద్ర—ఛీ! ఛీ! ఇంకఁ బేలవలదు. నిన్ను క్షమింపను. నా కన్న లింకను గప్పనలయునని ప్రయత్నింపకుము. రామహాతకసేవకాధములగు మీకందఱకు నేఁడు సంఘమరణము తప్పదు.

౫౦ అనుబంధము.

(కత్తి నెత్తును.)

(అందఱు రామ రామ యందురు. వేనవేలు కపుల యాకృతులు, రామలక్ష్మణాకృతులు గాన్పించును. ఇంద్రజిత్తు ఖడ్గము వదలి విభ్రాంతుఁడగును. మెల్లమెల్లఁగా విశ్రాంతి సంకేతమగు తెర వ్రాలును.)

ఇది తృతీయాంకము.

---

# చతుర్థాంకము.



యుద్ధభూమి.

(లక్ష్మణుఁడు ప్రవేశము.)

లక్ష్మ — ఆహాహా! ఏమికల్లోలము సంఘటిల్లుచున్నది? ఎంతచిత్ర యుద్ధము ప్రవర్తిల్లుచున్నది? రాక్షసకపియోధు లన్యోన్య మతిభయంకరముగా ఘోరయుద్ధము చేయుచున్నారో! ఓహో! ఈయనంక నాంజనేయమూర్తి కాఁబోలును రౌద్రాకారముతో నెంత చూడసొంపై కాన్పించుచున్నాఁడు!

సీ. భూమిధరంబులఁ ♦ భుజశక్తిఁ బెకలించి
పొడిగాఁ గార్చు కొందఱు ♦ నసురవరుల
శాఖోపశాఖలవృ ♦ క్షశ్రేష్ఠసంతతి
నపహరించి కొందఱు ♦ మడియఁజేయు
వాలంబు పొడిగించి ♦ పలు కంధరంబులఁ
జుట్టి కొందఱు నేలఁ ♦ గొట్టి చంపు
అసమానముష్టిప్ర ♦ హారాహతులచేతఁ
గొందఱు నిలపైనఁ ♦ గూలఁద్రోయు

గీ. కరములును జరణములు న ♦ ఖంబు లుగ్ర
సాధనంబులు జేసి యీ ♦ స్త్రపరివార
ముఖముఖ సంఘటాభీలవి ♦ ధముగ దైత్య
శవములకు దానవంబుగ ♦ నల్పె నహహ!

(వేఱొకవంకఁ జూచి) ఓహో! ఇచ్చట కపిశ్రేష్ఠుండగు సుగ్రీవుం డెట్టికదనచాకచక్యముం బ్రదర్శించుచున్నాఁడో! మేలు. సుగ్రీవా! మేలు. నీవు వానరసార్వభౌమపదవి కర్హుండ వగుదువు. (ఇంకొక దిక్కుఁ జూచి) ఆ! ఆ! ఏమిది? మాకపిసైన్యంబులు దిశలఁ బఱచుచున్నవి. కపుల దుఃఖఘోషాసహితకలకలారవం బల్లోలకల్లోలముగా నున్నది. పాదపంబు లెక్కు భల్లూకంబులు, కొండలెక్కు కొండముచ్చులు, వారిధిఁ జేరు వానరంబులుఁ గోటానుకోట్లయి యెంతయు లజ్జఁ గలిగించుచున్నవి (తెర వంకఁ జూచి) ఛీ! ఛీ! వానరసైనికులారా! ఏమిపనిచేయుచుంటిరి? శత్రులకు వెన్నిచ్చి బ్రదుకఁ జూడియే? మరలుఁడు. ఈ భయంకర రామరావణ సంగ్రామమునకు మీరు వచ్చినపని యేమి? చేయుచున్న దేమి? ఇంచుకైన లజ్జింపవలదే? ప్రాణములు విడిచియైన సరె, శ్రీరామచంద్రమూర్తికి సహాయులుగ నున్న మీజన్మముల కింక ఫలమేమి? ఇది? సంగ్రామపూర్వమున సుగ్రీవాలాపంబు లాడిన మీరందఱెప్పుడు తోఁకలు పీకుకొని పరువెత్తుటకన్న నాలుకలు పీకుకొని చచ్చిన మేలుగుఁగాదే? పరువెత్తియెందు దాఁగవలయుననుకొంటిరి? ఇండ్లకే పోవనెంచితిరా? మానలజ్జావిహీనులైన మీ మొగములపై సతులు పేడనీళ్ళు చల్లకుందురా? మానహీనులగు మీరుమానవతులగు మీమానవతుల వదనకమలంబుల నెట్లు దిలకింపఁ గలరు? గృహంబులకేగి గాజులు దొడిగించుకొని వంటయింట దూర నెంచితిరా? ఇచ్చట చావునకు భయపడి యిండ్లకుఁ బరువిడి యచ్చట నాకల్పాంతముగాఁ బ్రతుకుదురా? మగతనపు చావుచచ్చుయోగ్యతను గలిగించుకొనరా? ఛీ! ఛీ! ఇంకను

దిరుగ రేమి? నిలుఁడు. మీ రెంతో దూర మరుగ లేదు. తిరిగి యుద్ధరంగమునం బ్రవేశించి మీ పౌరుషమును నిలునఁ బెట్టుకొనుఁడు వీరపత్నివ్రతలగు మీ తల్లులకు మఘుఁజెరుపఁదాపు రించిన మీ రిదివఱకే యొనరించిన మహోపచారమునకు లెంపలు వాయించుకొని మరలుఁడు. రణరంగమున నిలుఁడు.

(విభీషణుఁడు ప్రవేశము.)

విభీ—లక్ష్మణకుమారా! రక్షింపవలయును. కుంభకర్ణుని మహాప్రయాసమున నిద్రనుండి లేపి రావణుఁడు రణమున కంపినాఁడు. మన సుగ్రీవుఁడు మార్గముననే యాతని ముక్కుచెవులఁ గొఱికి మహాభయంకరముగా నార్చుచు కపిలోకంబును గగ్గోలుగా వించుచున్నాఁడు మీ రా దెస కరుగవలయును.

లక్ష్మ— ఏమి? కుంభకర్ణుఁడే వచ్చియున్నాఁడా! ఏడీ? ఏడీ?

విభీ—అదుగో మహాత్మా! చూడుఁడు. వానితలనఱుత్రిమండలమున నాడుచున్నది.

లక్ష్మ—ఓహోహో! ఏమివిగ్రహ మిది? ఇట్టి భయంకరసృష్టిని విధాత యేయుద్దేశముతోడఁ గావించెనో గదా?

విభీ—మహాత్మా! మీరు త్వరగవడవలయు. నే నీప్రక్క నుందును.

లక్ష్మ— అట్లే కానిమ్ము. (నిష్క్రమించును)

విభీ—చిన్నన్నయగు కుంభకర్ణునితో రెండు మాటలాడవలయునని యెంతో కుతూహల మగుచున్నది. నేనన్న నాతని కెంతో ప్రేమ గదా! అదిగో యిటులే వచ్చుచున్నారు. నేను రెండడుగులు నడచెదను.

(తెరలో కుంభకర్ణుఁడు)

ఎవరక్కడ ? ఎవరక్కడ ? దుర్మార్గుఁడగు రామచంద్రాలు డెక్కడ ? ఇదిగో! వజ్రాయుధము. దేవతలను దీనిచేతనే తెయితెక్కలాడించితిని. రామలక్ష్మణు లేమిలెక్క? వీరినిఁ జంపుటకు నాకాయుధము లేల ? ఈముష్టి చాలు ఈబాహువు చాలును. హ్హా హ్హా హ్హా హ్హా.

విభీ—అన్నా! నేను, నీతమ్ముఁడను. విభీషణుఁడను నమస్కారము. పెద్దన్నకుహితముఁ జెప్పఁబోవఁగాలితోఁ దన్ని పంపినాఁడు. శ్రీరామచంద్రు నాశ్రయించి బ్రతుకుచున్నాను.

(తెరలో)

కుంభ—నాయనా ! చిరంజీవివిఁగమ్ము. నీవు చింతింపకుము. మా యందఱికన్న నాయుష్యముఁగలవాఁడవు గనుక రామసన్నిధిఁ జేరితివి. నన్ను వగము నిద్దురలో లేపిరి. నేను బ్రతుకను. రావణుఁడు బ్రతుకఁడు. లంకయంతయు నాశనమగుట నిక్కము. నీవైనను వర్ధిల్లి లంకంబాలించుకొమ్ము. ఇంక నీవు నాయెదుట నుండకు. వీరావేశ మణఁచుకొని యింతవఱకు మాటాడితిని ఇఁక నాకు శత్రుమిత్రభేదము తెలియదు. పో. నాయెదుటనుఁడి పో.

విభీ—మహాభాగ్యము (నిష్క్రమించును.)

(లక్ష్మణుఁడు ధనుర్ధరుండై ప్రవేశము)

లక్ష్మ—ఓహోహో ! ప్రపంచమున నేఁడేమి ప్రళయము సంభవింపలేదు గదా ! భూమినుండి యాకాశము దనుక నొక్కచే విగ్రహ మగు నీకుంభకర్ణుని భీకరాకారమునకు నవగ్రహములు వణకుచున్నవి. దిగ్గజము లీతని యార్పునకుఁదల్లడిల్లుచున్నవి. భూమి కంపించు చున్నది. సూర్యచంద్రులు

గతులు తప్పుచున్నారు. ఈనాఁటితో లోకవిలయమే కాదు గదా! ఏమిది? కుంభకర్ణుఁ డేదో యనుచున్నాఁడు.

(తెరలో కుంభకర్ణుఁడు)

గీ. కపు లెవరు? దైత్యు లెవ్వరు? — కానరాదు
భేద మింతైన నాకు; నీ • విరులెల్ల
నొక్కటియె లోకములనెల్ల • నూడ్చువాఁడ;
రాముఁ డెక్కడ? గద యేది? • రణము నేది?

లక్ష్మ — (విని) అదిగో! ఈదురాత్ముఁడు శ్రీరామచంద్రమూర్తిని గవయఁ జనుచున్నాఁడు. ఆఁ! ఆఁ! అదేమి? — హా! హా!

ఆ. కాండ్రు మనుచు నెగిరిఁ • శిరపాదములు తెగఁ
గడవాలాది నెత్రు • గారుచుండ
ఘనుని రాము నట్టె • గబళింప వినువీధి
కెగిరె నదిగో సేన • బెగడుచుండ.

రామప్రభూ! పరాకు. పరాకు. (ఆనందముతో) ఆహాహా! రాముని మ్రింగఁదలఁచిన కుంభకర్ణు రామాస్త్రములు మ్రింగినవి! సెబాస్! కుంభకర్ణా! రామబాణములచేఁ గృతార్థజన్ముఁడ వయితివి. ఓ హో ఏమిది? కుంభకర్ణుని మృతికి దేవతలు పుష్పవృష్టిఁ గురియుచున్నారు.

(తెరలో)

కుమారా! లక్ష్మణా! రక్షింపుము,. మాయావిద్యా నాథుఁ డగు మేఘనాథుఁడు మరల వచ్చినాఁడు.

లక్ష్మ — కపులారా! భీతి నందకుఁడు. నే నిదే వచ్చితిని. (నిష్క్రమించును.)

(ఇంద్రజిత్తు ప్రవేశము)

ఇంద్ర — ఓ సిగ్గుమాలిన దేవతలారా! పిఱికిపందలారా!

సీ. గదఁ బూని తనచేత ♦ కాలాంతకునిభంగి
మూపినతండ్రి భీ ♦ మముగనార్చి
మిము దాఁకి మీదుకే ♦ శములు ముష్టిని దాల్చి
గిరగిరఁ ద్రిప్పి యీ ♦ ధరణిమీద
మొత్తోయనుచు నేడ్చి ♦ మోములు పై కెత్తి
శ్రీహరి రక్షణ ♦ సేయుచుమనుచు
మొత్తుకొనిన యావి ♦ పత్తును మఱచిరే
శునకంబులార! యా ♦ శూరుఁడీవుడు
గీ. భూమిఁబడఁ జిల్కుచుంటిరే ♦ పుష్పములను
అతఁడు మరణింప నేనులే ♦ నా? సురేంద్ర
ముక్కలిలరాచి చిదుకంగ ♦ మోదమలర
దిశలు మార్మోయ నేడ్చిరి ♦ తెలియలేదె?

ఓరీ! వానరులారా! ఇంతమాత్రమునకే కిచకిచలాడుచు, తోకలు జాడించి గంతు లిడుచుంటిరా? మీపొట్టలు చింపి తాళ్లుగొట్టెద.

(హాయసీతను జుట్టుపట్టుకొని లాగుకొని వచ్చెను.)

సీత — 20. అనుబంధము.

ఇంద్ర — రా ఛండాలిసి! రా! ఇటురా. నిన్ను నీపతియగు రామ నిర్భాగ్యుని కన్నులయెదుట రెండుముక్కలు జేసెద రా!

సీత — హా! రామచంద్రప్రభూ! రామచంద్రప్రభూ! రక్షింపుము. ఈ పలుగాకి పవిత్రమైన కేశపాశమునుబట్టుకొని యీడ్చినా కంఠముత్తరింపఁ బోవుచున్నాఁడు. ఈ చండాలునిఁజంపి నీ ధర్మపత్ని రక్షింపవేమి? ఓ మహాబలవంతా! హనుమంతా! నీవైన రక్షింపవేమి? ఊరక చూచుచుంటివేమి?

హను — (ప్రవేశించి) (22. అనుబంధము.)

గీ విడువరా పాపచిత్త! ఛీ ♦ విడువవేర?
భీషణంబైన ముష్టి నీ ♦ పీచమణంతు
దేవదేవిని జానకీ ♦ దేవి నిటుల
నేతువా? నిలు! తీతునీ ♦ జీవములను.

(కొట్టఁ బోవును.)

ఇంద్ర—ఆగు! ఆగు! ఆగు! ఇఁక నొక్కయడుగైన ముందు పెట్ట వలదు. పెట్టినయెడల సీతను నఱికెదను, (జుట్టులాగును.)

సీత—రామా! రామా!! రామా!!!

ఆంజ—(తనలో) రామా! రామా!! ఎంత ఘోరపాపకార్యమును వీక్షించుచుంటిని?

ఇంద్ర—గీ. కను మిదియె చంద్రహాసము ♦ కాంత యిదిగో!
క్షణములో రెండు ముక్కలు ♦ గానొనర్తు
సీతచచ్చిన నిఁక నేమి ♦ నేయఁగలవో
చూచెదను గాక నో కపి ♦ శూరవర్య.

హను—ఓగీ కిరాతజన్మా! ఇంగితజ్ఞా!

సీ. నందనవనపుష్ప ♦ నవనవాలంకార
శోభ [illegible]బులై ♦ సురుచిరోప
మానరహితములై ♦ మహనీయపట్టాభి
షేకకైలోక్యసు ♦ స్థిరములౌచు
మంగళాలంకటియు ♦ నొవర సుదీర్ఘంబు
లై రామచంద్రున ♦ కాగ్రసత్వ
రామర్శనాంచిత ♦ రమణంబు వశి
ష్ఠాకృతౌ ఘశుభావ ♦ హంబులౌచు

గీ. నిపుడు విధివశమున మాసి, ♦ విపులధూళి
ధూసరితభంగిఁ గాంచిన ♦ తోయజాక్షి

కేశబంధంబు మెలివేసి ♦ నాశముందఁ
జేయు నీకెట్లు దానవా! ♦ చేతులాడు?

ఓరీపాపీ! యజ్ఞసంభవ, రామదార, దశరథుకోడలు, తాఁకిన కందు శరీరముఁగల బంగారుబొమ్మ;నీ కేమపకృతిఁ గావించె?

ఇంద్ర—ఏమియపకృతియా?

గీ. లంకఁ గాలఁ జేసె ♦ లంకిణిఁబడవేసె
వార్ధిఁ గట్టఁజేసె ♦ బాహుబలునిఁ
గుంభకర్ణుఁ గూల్చెఁ ♦ గులనాశము ఘటించె
శక్తి గాని యిది య ♦ శక్త గాదు

దినదినము నసంఖ్యాకాక్షౌహిణిసేనల నీ మహామారి దిగమ్రింగుచుండ నేమిచేసెనని యడిగెదవేమి? కన్నులు లేవా?

సీత.—ఓరీ పాపీ! కల్లుఁద్రావినవానివలె మాటలాడెద వేమి? ఇంత ఘోరమునకుఁగారణమైన నితండ్రిని దూరక నన్ను నెదవేమి? నన్నుఁజుట్టుపట్టిలాగినట్లు నీతండ్రిని జేసినచో బుద్ధివచ్చునేమో? బ్రాహ్మణుఁడవు. పవిత్రుఁడవు నీకీఘోరకార్యము తగదు. తగదు. మానుము. నీవేదాధ్యయనమంతయు వెలఁదులఁ బరిమార్చుటకా? ఇంత చండాలకార్యమున నుపక్రమించితివేమిరా? చెనఁటీ! ఇంతకటికవాఁడవా! అఁసుదాననురా! నన్నింతచేసిన నీవు దక్కవురా? నీ వంశ మన్నుగుదువురా! నీచావు సమీపించినదిరా! స్త్రీహత్య తగదురా! హా రామా! రామా! రాజీవలోచనా! నాకంక నీచెలి యెన్నినాళ్ళోయి!

ఇంద్ర—ఎన్నినాళ్ళోనా? గడియలుకూడ లేవు. నీచెలి ...
కేవ్రియత్నింగుచున్నాను. రా, రా, ఇప్పుడే తెగఁ కెదను
(కత్తి నెత్తును.)

సీత—హా రామా! రామా! (ఏడ్చును.)

హాను—(కోపముతో) రే! చండాలా! చచ్చితివిరా! విడువు. సీతను విడువు. మాతల్లిని విడువు. చచ్చెదవు. పొడియయ్యెదవు.

ఇంద్ర—అంరాకు రాకు. దగ్గరకు వచ్చితివో సీత చచ్చినదో!

ఆంజ—(తనలో) హా హా! వ్యర్థుఁడనైతిని వట్టి పనికిమాలినవాఁడనైతిని. ఏమిచేయుదును?

సీత—నాప్రాణములుపోవుచుండఁగా, నట్టునిశ్చలుండవై, నిర్వికారుఁడవై, నిలువఁబడుటఆంజనేయా! నీకుతగునా? నామీఁదనీకేల దయతప్పెను? మారుతీ! నన్ను రక్షింపవా? హా హా! ఏమి నావెత్తి? దగ్గరనున్న రాముఁడే రక్షింపలేకపోయెను. రాము దూత రక్షింపఁగలఁడా! ఓరి చండాలుఁడా! నన్ను వదలుము. లేనిచో భస్మమగుదువు. నీశిరము సహస్రశకము లగును.

ఇంద్ర—ఆ, ఇంకను పొగరణఁగలేదా! అట్లయిన నిన్నింకబ్రదుకనీయఁగూడదు. ఓరీ హనుమంతా! సీత మరణవార్త రామునకుఁజెప్పుకొమ్ము, పొమ్ము. నేనిదే దీనిని సంహరించుచున్నాను. (ఈడ్చుకొనిపోవును)

(తెరలో) హా! రామా! రామా! లక్ష్మణా! హా తండ్రి! హా కౌసల్యా!

హాను—హా! హా! అయినది. అయినది. ఆ క్రౌంచముపనియు నయినది. అంబా! అమ్మా! సీతమ్మా! మాతల్లీ! మొద్దువలెనే యుండియు నేమియుఁ జేయలేపోతినా!

ఆ॥ యజ్ఞభూమిలోన ♦ నవతార మందినా
వఖిలలోకమాత ♦ వగుచు నలరి
యుతవాని కమఁగు ♦ కాంతాలలామవై
తెటులఁ గోసినన్నఁ ♦ గటికవాఁడు.

ఆహా! తల్లీ! సీతమ్మతల్లీ! లోకములకెల్ల తల్లీ! సీతమ్మతల్లీ! దురాత్ముఁడగు నింద్రజిత్తు కత్తి కాహుతియైతివా అమ్మా! మాయమ్మా!

ఈవార్త శ్రీరామమూర్తి కేమనివిన్నవింపను? ప్రాణముగల చట్టుజాతి వలెనెట్టయెదుట నిలువఁబడినీమరణమును జూచుచుండిన చండాలుండ నని రామచంద్రమూర్తితో వచింపనా? అయ్యో! తల్లీ! ఎందఱ కెంత యార్తిఁబెట్టి మము సీడి దారిచూచుకొంటివి! రావణుని చావుఁ జూడకుండ, శ్రీరామమూర్తి నిగంటఁ జూడకుండ, క్షోభించి క్షోభించి మరణించితివా తల్లీ! ఇంక మాసైన్యము లెందులకు? నే నెందులకు? సుగ్రీవుఁ డెందులకు? మేము బ్రదికి యెందులకు? హాహా! బ్రిదుకఁజాల. ఈ పాడునోటితో రామమూర్తి కీవార్త నెఱిఁగింపఁ జాల హా! రామభద్రా! లక్ష్మణా! సీతమ్మతల్లీ! సీతమ్మతల్లీ! (మూర్ఛిల్లును.)

ఇంద్ర—(ప్రవేశించి) మాయసీతను జంపితినని వీరికిఁ దెలియక పూర్వమే సమ్మోహనవిద్యచే వీరినిఁ గట్టి వేయవలయును.

(సమ్మోహనాస్త్రమువిడచి నిష్క్రమించును.)

(చీకట్లు క్రమ్ముచున్నవి రామ లక్ష్మణులు ప్రవేశము.)

లక్ష్మ—మహాప్రభూ! ఇప్పుడేదియో పెద్దకోలాహలము మాత్రము జరిగినది. ఇంతలో నీయంధకారమైనది. నేఁ డిదంతయు మేఘనాథుని యుద్ధవిశారదత.

రాము—ఇచ్చటఁ బడుండి యుండినదెవ్వరు?

లక్ష్మ—హనుమంతునివలె నున్నాఁడు. ఆంజనేయా! ఆంజనేయా!

హను—(లేచి) రామచంద్రప్రభూ! వచ్చితిరా? వచ్చితిరా? మీ కంటఁబడకుండ ప్రాణములుపోవుభాగ్యము లేకపోయెనా! ఈ పాడుమాట నానోటనే తెలియవలసివచ్చినదా! హా! హా! (ఏడ్చును.)

రాము—ఆంజనేయా! ఏడ్చెదవేమి?

లక్ష్మ—మారుతీ! దుఃఖమెఱుంగని బ్రహ్మచారివి. నీ కీవిచార మేల యేమైనది?

హను—నాకు నోరు రాదు తండ్రీ! నోరు రాదు. హా తల్లీ! తల్లీ! సీతమ్మతల్లీ!

రాము—తల్లీ యనుచుంటివి. జానకి కేమయినది?

లక్ష్మ—వధూనిక నెవ్వ రేమిచేసినారు?

హను—ఆహా! రామచంద్రప్రభూ! ఈ కఠినవార్త నెట్లు తెలుపుదును?

రాము—మారుతీ! మాకు కఠినవార్త లేమిటి చెప్పు. రాజ్యము పోయి, నారలుధరించి, కాంతాశిరోమణియైన జానకిని పోఁగొట్టుకొని—

హను—జానకీదేవిని ఇంద్రజిత్తు సంహారించినాడుఁ మహాప్రభూ!

రాము—హా! హా! హా! (మూర్ఛిల్లును.)

లక్ష్మ—రామచంద్రా! రామచంద్రా! (ఏడ్చును.)

హను—రామచంద్రా! రామచంద్రా! (ఏడ్చును.)

రాము—హా! జానకీ! సుగుణరాశీ! యజ్ఞవేదీసంభవా! పరమపవిత్రా! ఎందరెందఱురాజన్యులు వచ్చినను వరింపక శివధనుర్భంగమున నన్ను వరించి పొందుసౌఖ్యము లివ్వియేగదా! అడుగులను మడుగు లొత్తింపనైతిని. పుడమిపతికిఁ బట్టమహిషివను విఖ్యాతిఁగాంచనీయనైతిని. ముద్దుముచ్చటఁ జెల్లింపనైతి. తుదకొకనాఁడు కడుపార తిండియైన లేక, కంటినిండ నిద్దుర లేక, నోంటినిండ గుడ్డలేక, తలకు నూనెయైనలేక మెడలో పసుపు బొందుతోడ పదునాలుగేండ్లు ఱాలనక, రప్పలనక, చెట్లనక పుట్టలనక త్రిప్పిన దురాత్ముఁడను. నీవు నాకు మహాలక్ష్మివి దక్కుదువా? హాతల్లీ! దండకారణ్యముల సీత జాగ్రత్తయని పలికితివే? ఇంక నీకోడలిని మింగిన రాముఁడు నీయెదుటకు

రాదులే. తమ్ముడా! సీతయే నాతల్లి సుమిత్ర కాదని పలుకు చుందునే! ఇప్పుడు మీయమ్మ యేది తండ్రీ? లంకనుండి యెన్నఁటికైన వచ్చి నన్నుఁ జూచునని గంపెడాసతో నుంటినే! హా! ఇప్పుడాయాసలన్నియు భగ్నములైనవి గదా! హా! నేనింకెవ్వరికొఱకు బ్రతుకుదును? హా! సీతా! సీతా! సీతా! (మూర్ఛిల్లును)

(తెరలో) ఏవరక్కడ! ఎవరక్కడ?

లక్ష్మ—రే చండాలుఁడా తిరిగి వచ్చితివా? సీతాదేవినిఁ జంపెదనని బెదరించితి విప్పుడు రారా.

విభీ—రాఘవులారా! రక్షింపుఁడు. నేను విభీషణుఁడను. చీకటిమైనందున దిక్కులు తెలియవు. ఎక్కడ? ఎక్కడ?

లక్ష్మ—విభీషణా! క్షమింపుము. ఇక్కడ. ఇక్కడ. ఈఘోరవార్త వింటివి గదా!

విభీ—అహాహాహా! సౌమిత్రీ! వట్టిది వట్టిది. ఇంద్రజిత్తు మాయసీతను జంపి మనలను భ్రమపెట్టినాఁడు.

అంజ—ఆ! ఏమీ! మాయమ్మ బ్రతికియే యున్నదా!

విభీ—అహా! బ్రదికియే యున్నది. ఆయమ్మను జంప వీరి తరమా!

లక్ష్మ—(కత్తి దూసి) మాయసీతయను మాట నుంచుము. ఇంద్రజిత్తుఁ బంప నిటకు వచ్చి మమ్ము మోసగించు మాయావిభీషణుఁడవుగదు వేమొ తెల్పు; తెగనఱకెద

విభీ—సౌమిత్రీ! ఏమీతొందర. ఇంద్రజిత్తుఁడుగో మేఘములలో నెట్లు తిరుగుచున్నాఁడో! సంహరింపుము. ఆలసింపకు.

(మేఘములలో నింద్రజిత్తు కనఁబడును.)

లక్ష్మ—అంజనేయా! మూర్ఛిల్లిన అన్నగారు జాగ్రత్త. విభీషణా!

నా వెనుక నుండుము. రే! లోకకంటకా! ఇంద్రజిత్తూ! ఎం
త కాలమునకు దొరికితివిరా! పాపాత్మా!

(బాణము వేసి ఇంద్రజిత్తును జాపును)

## 2 వ రంగము.

(సులోచన, ప్రహస్తుఁడు ప్రవేశము)

సులో—ప్రహస్తా! ఆ పరాక్రమశాలి యెక్కడ? ఆ జగదేకవీరుఁ డెక్కడ? దేవేంద్రజిత్తుఁడగు నానాథునిఁ బరిమార్పఁగలిగిన యా భుజాసారుఁడగు మహానుభావుఁ డెక్కడ?

ప్రహ—అమ్మా! దురాత్ముఁడై నీనాథుని జంపినవానిపై నించుకై న పగలేక మాటలాడెదవేమి?

సులో—వెఱ్ఱివాఁడా! జగద్వందితమగు శూరకృత్య మొనర్చి క్షాత్రమును నిలువఁబెట్టినవానిపైఁ బగ యేమి? ప్రాణములు శాశ్వతములుగావు. చూడు, రేపైన, నెల్లుండియైననీప్రాణములు శరీరమునుండి తరలవలసినవేకదా! దానికి చింత యేమి? పదునాలుగేండ్లు నిద్రాహారములేనివాఁడు దక్క నానాథు నింకొకఁడు చంపఁలేడు. అట్టి పరాక్రమనిధిని, బుణ్యమూర్తిని దర్శించుటకన్న నాజన్మమున కింకేమి కావలయును?

ప్రహ—కాని, తల్లీ! నీ వెంతగట్టిగుండెఁ గలదానవో కాని కాంతుఁడు పోయినను కంట తడి పెట్టకున్నావు కదా!

సులో—ప్రహస్తా! పెద్దవాఁడవైనను నీవు తెలియక పలుకుచున్నట్లు తోఁచుచున్నది. చనిపోయిన వారికొఱకు మన మేడ్చినంత కాలము వారి కుత్తమగతులు సిద్ధింపవు. అదిగాక భగవంతులని చెప్పఁబడు రామలక్ష్మణుల శరములఁ గూలిన నానాథునికై నే నేడ్వనేల!

ప్రహ — రామలక్ష్మణులు భగవంతులని నీవును చెప్పెదవా? తల్లీ!

సులో — కారే యనుకొనుము. అట్లయినను క్షత్రియులు గదా! వారిచేతులలో క్షాత్రమరణమునకన్న నా నాథున కేమికావలయును? రణమరణమున వీరస్వర్గము లభించుఁగదా! నేనాయనకై చింతించుట వెఱ్ఱికాదా? జీవించినన్నినాళ్ళును సేవఁజేసికొంటిని ఇప్పుడు మృతినందిన నాథునితో సహగమనమయి, నేనును బుణ్యలోకములం జేరుదును.

ప్రహ — మేలు! వీరపతివ్రతా! మేలు! నీకింకొకజన్మము లేకుండుఁగాక.

(నిష్క్రమించును.)

(రామలక్ష్మణులు ప్రవేశము.)

సులో — మహానుభావులారా! మీ రెవ్వరో నే నెఱుఁగను. నా భర్తను చంపిన పుణ్యాత్ముని దర్శింపవచ్చితిని

రాము — మహాత్మా! నీవు మేఘనాథుని సతివగు సులోచనవా? నీపతిని చంపిన నా తమ్ముఁడీతఁడే లక్ష్మణుఁడు.

సులో — అట్లయిన నామమ ప్రమాణముగానైయుందురు. రాఘవులారా! నమస్కారము. నా భర్తకు శేషమును కర్మసంస్కారము నుచేసి సహగమనము నొందుదును. శిరస్సును వానరసైన్యమున నెవరో దాఁచిరఁట. నా కిప్పించి పుణ్యముఁగట్టుకొనుఁడు.

రాము — నీపతిభక్తికి మెచ్చితిని ప్రపంచమునఁ బతివ్రతకన్న నమ్మా! పూజ్యవస్తువులేదు. నీ భర్తశిరస్సునే కాదు, ఏపాటులనోపడి నీభర్తనే బ్రదికింపఁజేసి యిచ్చెదను.

సులో — రాఘవేంద్రా! వలదు. వలదు. నన్ను క్షమింపుము. నా భర్తకు తిరిగి రాఘవుల చేతి మరణము లభించునా? దుర్లభమగుమరణమునందిన నా భర్త పుణ్యాత్ముఁడయ్యెను. ఎప్ప

టికై నచావనలసినవారలకు శీఘ్రముగ నెంతమంచిమరణము లభించిన, నంత మంచిది.

(23 అనుబంధము.)

**రాము**—సెబాస్.తల్లీ! దేవతలు పుష్పవృష్టి గురియందగిన మాట లాడితివి. రాక్షసులలో నయితము జ్ఞానులు గలరనిపించితివి.

**లక్ష్మ**—ఈమెమాటలచే నీమెపతిని జంపిన నాకు సిగ్గగుచున్నది.

**రాము**—అమ్మా! రమ్ము- నీపతిని నీ కర్పించెద.

24 అనుబంధము.

(అందఱు నడతురు)

(తెరలేవఁగా యుద్ధభూమి క నఁబడుచున్నది. విభీషణాదులు, కపులును కనఁబడుదురు )

**విభీ**—బిడ్డా! సులోచనా!

సీ. పరునిపక్షము జేరి ♦ భర్తను వధియింపఁ
జేసితినని చింతఁ ♦ జెందకమ్మ!
మనసార హితబోధ ♦ లొనరించినను గాని
గమనింప కీగతిఁ గాంచెనమ్మ!
భర్తృశోకంబున ♦ బడఁతిరో మూర్ఖైనఁ
గోపంబును ♦ జూపకమ్మ!
శ్రీరామకరముక్త ♦ శితబాణహతిని నీ
కాంతుఁడుత్తమగతిఁ ♦ గాంచునమ్మ!

గీ. కలికి! నీవంటిసాధ్వులు ♦ గలుగవమ్మ!
పంతిలక సహగమనంబుఁ ♦ జెందనున్న
వీరపత్నివి, సురలు దీ ♦ వింతురమ్మ!
శీలవతివైతివి సులోచ ♦ నా! లతాంగి!

సులో—చిన్నమామగారూ! మరణవేళ నాశీర్వాదములా యివి? నాకు మీపై నాగ్రహముండుట కెట్టిహేతువులును లేవు. మీయౌదార్యమువలన నాహృదయేశ్వరుఁడు తిరిగి లభింపఁడుగదా! కానిండు. ఎట్లు మరణించిననేమి? ఎవరు కారణమైననేమి? అనన్యలభ్యమైన రాఘవునిచేతి మరణంబు నందిన నానాథుఁడు ధన్యుఁడు. ఆయనతోడ సహగమనముం గాంచనున్న నేను ధన్యురాలను. ఆ యానందముతోడనే నాప్రాణంబులను వదలుచున్నాను. నాకొఱకై మీరు విచారింపవలదు. నా యాగ్రహానుగ్రహంబులతో మీకుఁబని లేదు. మీకుమాత్ర మేమిలోపమున్నది? శ్రీరామచంద్రుని యాశ్రయంబున మీరును కృతార్థజన్ములైతిరి. అయినను కులద్రోహపాపంబు మీ కంటకమానదు. ఈ రామచంద్రమూర్తి యాచంద్రతారకమగు లంకారాజ్యమును మీకు సమర్పించినను మీరు దాని నెంతోకాలము పరిపాలింపఁజాలరు. మ్లేచ్ఛ, కిరాత, పంచమకులంబులవారు ముందు ముందుఁ బాలింప మీ రదృశ్యరూపంబున లంకాపురంబున నుండవలసినవారే. ఇఁకమీకు నాతోఁ బనిలేదు శ్రీరామచంద్రప్రభూ! నానాథుఁడు వీరస్వర్గమార్గంబున నతిదూరమరిగియుండును. సత్వరంబుగ దత్కళేబరంబు నొసంగిన నో సహగమనంబై నానాథునిఁ గలసి కొందును.

రాము—అవును. సుగ్రీవా! మేఘనాథుని కళేబర మీసాధ్వీమతల్లి కిప్పింపుము.

సుగ్రీ—రామప్రభూ! అసంఖ్యాకములయిన కళేబరములలో మేఘనాథుని శరీరము గుర్తించుట కష్టము.

సులో—సుగ్రీవరాజా! మీ రెవ్వరికిని శ్రమమువలదు. నేనే నానాథుని

శరీరంబును వెదకికొనును. (జలంబులు పట్టి) నేను నిజంబుగ పతివ్రతనగుదునేని నానాథుని శరీరంబుఁదక్క మిగిలిన వెల్ల భస్మీభూతంబు లగుఁగాక! (జలంబులు చల్లగా శవము లన్నియు భస్మములై మేఘనాథుని కళేబరము కనఁబడును.)

రాము—ఆహా! సులోచన పాతివ్రత్యము. మేలు! వీరపత్నివతా! మేలు! సభర్తృకంబుగ నక్షయస్వర్గలోకసుఖంబు నందుము. సుగ్రీవా! ఈయమకుఁ జితిఁ జేర్పింపుము.

సుగ్రీ—భాగ్యము. (నిష్క్రమించును.)

సులో—రామచంద్రప్రభూ! నమస్కారము. సుమిత్రాకుమారా! నమస్కారము. సమస్తకపిలోకంబులారా! నమస్కారము. దుష్కరమగు దైత్యకులంబునఁ బుట్టియు కులముతో నిమిత్తములేక, సౌశీల్యమే ప్రధానముగాఁ గలిగి నేను నాప్రాణేశ్వరునితోడఁ బరలోకసౌఖ్య మనుభవింపఁబోవుచున్నాను. సెలవిండు. దశదిశలారా! సెలవు. సూర్యచంద్రాదినవగ్రహములారా! సెలవు. ఆహా! హుతాశనమూర్తియు నేత్రపర్వముగా వెలుఁగుచున్నాఁడు. జయ్ శ్రీరామచంద్రపరబ్రహ్మమూర్తికి జయ్. ఓపరాత్పరా! కర్మసాక్షీ! జన్మజన్మంబులందును నాకు మేఘనాథుండే పతియగునట్లు దయచేయుము. నీకు పదివేల నమస్కారములు. (అగ్నిలోఁ బడుచున్నది.)

తెరవ్రాలును.

ఇది చతుర్థాంకము,



# పంచమాంకము.



## 1 వ రంగము.

(రామ; లక్ష్మణ, విభీషణులు ప్రవేశము.)

రాము—విభీషణా! ఆ మహాకాంతి యేమంటివి?

విభీ—మహాప్రభూ! అదితప్పక రావణుని దండయాత్రయే. ఆకాంతి రావణుని కిరీటముల దాపఁబడిన నవరత్న కాంతి యని తోఁచుచున్నది.

(తెరలో సుగ్రీవుఁడు)

గీ. రండు వానరవీరులా ♦ రా దశాన
నుండు చండధనుష్కళా ♦ పండితుండు
రణమునకు వచ్చె రాక్షస ♦ రాసితోడ
తరుతతులఁ దెండు తండోప ♦ తండములుగ.

విభీ—రామప్రభూ ! అదిగో సుగ్రీవుని యాజ్ఞ వినఁబడుచున్నది. రావణునివంకకు మన మింక మరలవలయును.

రాము—అట్లే చేయుదము. పాపాత్ముఁ డెంతకాలమునకు కాకంటఁ బడినాఁడు? తమ్ముఁడా! బాణము. తూణము.

లక్ష్మ—మహాప్రభూ ! క్షమింపవలెను. నాదొక చిన్నమనవి యున్నది.

రాము—తమ్ముఁడా ! ఇది యేమి ?

లక్ష్మ—పూజ్యురాలగు వధూనికను గొనిచనిన యా దశకంఠచండా లుని ముఖాముఖి నెదుర్కొని సంభాషించి నా వేడినారాచ ములు రుచి వాని కెఱింగింపవలయునని యెన్నిదినములనుండి యో యభిలషించుచుంటిని. కాని యట్టి శుభకాల మింతవఱ కు సంభవింపదయ్యెను. నేఁడు వాకా రణభిక్షనుదయచేయ వలయును.

రాము—తమ్ముఁడా! ఇది యేమివెఱ్ఱి? ఆరితేఱిన యమరేశ్వరాదుల కలవిగాని యసురాధముం డెక్కడ ? ముక్కుపచ్చలారని ముద్దులబాలుఁడవు నీ వెక్కడ? నాయనా! రావణునితోడ రణము నాకుఁగాని నీకుఁ దగ దూరకుండుము.

లక్ష్మ—అన్నయ్యా! సోదరవత్సలురగుతమరు నన్నిట్లు నిరుత్సాహ పరుపఁ జూడిరయా! రామరక్షగల నాకు రావణనారాచశిక్ష యొక లెక్కయే.

గీ. తావకాశీర్వచనమైన, ♦ ధరణితలము
బొంగరమువలెఁ ద్రిప్పుదు, ♦ భువనములను
గడగడను వడఁకించెద, ♦ కమలభవుని
వ్రాలు మార్చెద, నసిఁ దాల్చి ♦ రణమునందు.

రాము—తమ్ముఁడా! నిన్ను నావెంటఁ బంపునప్పుడునీతల్లి సుమిత్రా దేవి, నీరక్షణమును నాభుజంబుల నిడియె. నీకు రావణుని తోడి సంగ్రామమున నపాయమేమైన సంభవించిన నేనోర్వఁ గలనా?

25. అనుబంధము.

లక్ష్మ—రామభద్రా! రఘువంశమునఁ బుట్టిన మీతమ్మునిపట్ల నవజయశంకను వహించెదరేమి? ఆ పాపాత్మునకు రామానుజుని బాణాగ్నులరుచి నెఱింగించి నుఱివచ్చెదను హనుమంతుఁడు నా వెంట నుండును దీవించి పంపుఁడు. నేనిదివఱ కేదియర్థించినను లేదని యెఱుఁగరు. ఇప్పుడుమాత్రమేల నా మదిఁజిన్నబుచ్చెదరు.

రాము—తమ్ముఁడా! చింతపడకుము, హనమంతుని తోడిచ్చి నిన్నుఁబంపెదను. తండ్రీ! మితిమీఱి యాదానవునితోఁ గార్యంబు నెఱపకుము. మన విభీషణుఁడును నీదరి నుండును. రాక్షసు లనేకమాయలఁబరపుదురు. వాని మెలకువ లెఱింగి ప్రవర్తిల్లుము. మన వంశకర్తయగు సూర్యభగవానుఁడు నిన్ను రక్షించుఁగాక! పరేతలోకమందున్న మనతండ్రియగు దశరథరాజేంద్రుఁడు నిన్నాదరించుఁగాక! విభీషణా! రమ్ము. మనము సుగ్రీవాంజనేయులం గలసికొని సౌమిత్రిని రణమున కంపుదము.

విభీ—మహాప్రసాదము (అందఱు నిష్క్రమింతురు)

(రావణుఁడు, సూతుఁడు; ప్రవేశింతురు.)

రావ— సూతుఁడా! రాముఁడు కానిమ్ము. లక్ష్మణుఁడు కానిమ్ము. పాదచారులై ధరణీతలముననే రణము గావింతురు గావున రథమును దూరముగా నిలిపియుంచుము. పొమ్ము.

సూతు—భాగ్యము. (నిష్క్రమించును)

రావ—ఏమి? నేఁడు లక్ష్మణుఁడు నన్ను మార్కొనవచ్చువాఁడా? హ్హా హ్హా హ్హా ఏమి వీని సాహసము? మహానలంబునఁ బడఁ

బోవు శలభంబు ననుకరించి చనుదెంచం బోవుచున్నాండే యీ పసిబాలుండు. సరే! రానిమ్ము.

(విభీషణుండు ప్రవేశము.)

**విభీ**—అన్నా! రామసేవకుండను. విభీషణుండను. నమస్కరించుచు న్నాను. నిన్ను విడచి రెండునెలలు కావచ్చినది. జ్ఞప్తి యున్నదా?

**రావ**—ఓరి వంశనాశనుండా! నీవంటిగా పాపీ! నాకంటంబడితివా? ఇంటిగుట్టు లంకకెంత చేటైనదిరా! తులువా! రాముండేమి నీకమృతముపోసినాండు? రావణుండేమి విషముం బోసినాండు. నీరహస్యములను నేనేమి వెల్లడించితినని, నాగహస్యములను వెల్లడించితివి. నీకొడుకును నేను చంపితిననియే, నాకొడుకును చంపించితివా?

**విభీ**—నీకొడుకును నీవే చంపుకొంటివి. ఇంక నిన్నును నీవే చంపు కొందువు. నావలన నేమగును?

**రావ**—హా! హా! ఏమంటివి? నా కన్నకొడుకును నేనే చంపుకొంటి ననియా! అట్లయిన నిన్నును నేనే చంపెదనురా! నాలంకం గాల్పించితివి నాకొంపం గూల్చితివి. నాకమువు కాల్చితివి. నా పరువుదీసితివి. నన్నల్లరిచేసి నమవీధికెక్కించి క్షోభపెట్టి తివి. నా కొంతుకలను మొండిఅంపములతోం బరపరం గోసి తివి. కులద్రోహీ! చండాలుండా! అధమాధమా! విశ్వాస ఘాతకా!

**విభీ**—అవియన్నియు నీవే! ఈ పనులన్నియు నీవే చేసికొంటివి. నీ లెంపలు గట్టిగా వాయించుకొనిన నింత యవాంతరము గలు గదు. నన్నుందిట్టెదవేమిం?

**రావ**—ఆ ఆ! ఏమి ప్రేలితివిరా! తండ్రిచచ్చిన నిన్ను పోషించి పెం చిన నన్నింతచేసిన నీవు విశ్వాసఘాతకుండవు గావా! నేనే విశ్వాసఘాతకుండనా! ఛీ! దుర్మతీ! ఇదే చచ్చితివి. నిలు వుము.

సీతలేనినీయున్న గామునుం డనాథుండు. ప్రభుండులేని నీ వనాథుండవు. రామునంహారమైనపిదప సీత యనాథ.

లక్ష్మ—ఛీ, ఛీ, జగన్నాధునిపతి, యనాథయగుటేమి? సమస్త జీవన నాధుని పత్ని యనాథయగుటేమి? భువనాధినాథుని పాణేశ్వరి యనాథ యగుటేమి? నీ మరణానంతరమున నీదారాపుత్రపరివారనివహం బు లనాథ లగును.

రావ—ఓరి బాలుండా! ఆ జగన్నాథుం డెవ్వండు? నాకన్న జగన్నాథుం డెవ్వండుగా?

గీ. ఎల్లభువనంబులను నేడ ♦ యించివాండ
సురలం జెఱకుంగట్టిలభాతి ♦ నలికివాండ
వెదకినను గానరాని యా ♦ విష్ణుం డెవండు?
ఎందు దాగినవాండు ♦ వాం ♦ డెందుం జచ్చె?

లక్ష్మ—ఓరి దానవా! పామరుండవైన నీకటరా విష్ణుదర్శన మబ్బుట? మునుల భార్యలం జెఱపట్టుచు, యజ్ఞంబులను నాశనముం జేయుచు, హోమగుండంబుల రక్తంబుం జల్లుచు, జన్నిగట్టులం జానమోదుచు, హింసావృత్తిగల నీకా విష్ణుమూర్తి గానవచ్చువాండు?

గీ. చిరతరతపంబుల కలండు ♦ చిక్కంబోండు
మెండయిన హోమములకును ♦ వశ్యుండు గాండు
కత్తి ఝళిపించినను గడ ♦ గడ వణకండు
పావనంబైన భక్తిచే ♦ బద్ధుం డగును.

అదిగాక విష్ణువు సర్వాంతర్యామి అతనిచే నీకుమృతి కలదు

రావ—సర్వాంతర్యామియా! హే! హె! హే! ఏమి వాచాలత?

లక్ష్మ—ఓకులద్రోహీ! నీకు బుద్ధియున్నచో సర్వాంతర్యామియని తెలిసికొనుము.

రావ — ఓరీ! బుద్ధిహీనుఁడా! నాకుఁ గాదు. నీపాటునోటికి బుద్ధిచెప్పుటకే వచ్చితిని. నేను బ్రాహ్మణధర్మమున కేమిలోటు చేసితినని నన్ను కులద్రోహి యంటివి? ఉదయము గాకుండ కోటిశివలింగముల నర్చించువాఁడనని తెలియవుగా!

లక్ష్మ — ఓరి తెలివిహీనుఁడా! కోటిశివలింగముల నర్చింపఁగలిగిన వాఁడవు భగవంతుని సతియని తెలియలేక చెఱపట్టితివేమిరా?

రావ — భగవంతుఁ డెవ్వఁడు?

లక్ష్మ — శ్రీరామచంద్రమూర్తి.

రావ — ఛీ, ఛీ, అనుభవహీనుఁడా! భగవంతునివస నీ వేమెఱుఁగుదువు? భగవంతునికొఱకై నేను వెదుకని ప్రదేశములు గలవా?

సీ. వనధులందెల్ల నా ♦ భగవంతు నరయుఁగా
గాలించితిని గాని ♦ కానరైతి

లక్ష్మ — వనధులం దాతఁడో ♦ దనుజాధమా! మీన
మై వసించెడు మహా ♦ మాంత్రికుండు,

రావ — గిరులక్రిందను మేటి ♦ తరులక్రిందను వాని
గాలించితిని గాని ♦ కానరైతి

లక్ష్మ — గిరులక్రిం దాతఁడు ♦ సరకూర్మరాజమై
సిరతరంబు వసియించు ♦ నిర్మలుండు,

రావ — అడవులందెల్ల నా ♦ యధముని వెదకుచు
గాలించితిని గాని ♦ కానరైతి

లక్ష్మ — అడవులందున వరా ♦ హంబై వసించెడు
సకలబ్రహ్మాండనా ♦ యకుఁ డతండు,

రావ — కేమి నజాండమునందు ♦ దారుకొండములందు
గాలించితిని గాని ♦ కానరైతి

లక్ష్మ— పరదారుపులయందు ♦ నరసింహమూర్తియై
భీకరాకృతిఁ గ్రీడ ♦ వెలయు సతతము,

రావ— భూసురోత్తములందు ♦ భూవరోత్తములందు
గాలించితిని గాని ♦ కానవైతి

లక్ష్మ— భూసురోత్తముఁ డౌచు ♦ భూవరోత్తములను
ఖండించు పరశుహస్తో ♦ ద్దండుఁ డతఁడు,

సీ.- పలుకనేటికి శ్రీరాము ♦ భద్రుఁ డగుచు
నిన్ను వధియింపఁ గా సాధు ♦ నిచయములను
గావ దశరథభూపాల ♦ గర్భజలధి
నుదయమందిన సత్పూరు ♦ షోత్తముండు.

రావ— ఓహోహో! ఆయన్న పురుషోత్తముఁడగుటయు, నీతమ్ముఁడు మెచ్చుకొనుటయు సరిపోయినది. పురుషోత్తముఁడటఁ. ఆలినిబరుఁడు కొనిపోవఁగా నేడ్వలేక తమ్మునిచే వేదాంతములు చెప్పించెనఁట! అహాహాహా!

విభీ— రావణా! దనుజేశ్వరా!

రావ— ఏమిరా నీ వాచాలము? రావణా యనుచుంటివి. సోదరా యనుపిలుపు చట్టుబండలు చేసితివా!

విభీ— ఛీ, ఛీ, నీవు నాసోదరుఁడవా? నాసోదరుఁడవైనచో నావలెనే యుందువు భగవద్దూషణముఁ జేసి నరకము పాలగుదువా?

రావ— ఓరీ కులద్రోహీ! ఏమిరా నీప్రగల్భము. నరకము నీకా, నాకా? విశ్వకీర్తి సహితుఁడగు దనుజవంశమున జనియించి కులమున కపకీర్తి రహింప శత్రుపక్షమునన్ జేరి లంకకుఁ జేటుఁ గూర్చినది చాలక నేను నీవలె నుండనయితినని చెప్పుచుంటివఁటరా? ద్రోహులలో శ్రేష్ఠుఁడ వైన యదుగులకు [illegible] త్రాగుచుంటివి గ

దా! నేను భగవద్దూషణతత్పరుఁడనై తినవి మిడుకుచుంటి నే మిరా పాపీ !

విభీ—అన్నయ్యా!

రావ—ఛీ, ఛీ, చండాలుఁడా. ఇంక నిన్ను క్షమింపఁగూడదు, సోదరుఁడనిన భక్తిలేక, చేసిన పాడుపనికి లజ్జలేక మానాభిమానములు లేక ప్రేలుచున్న ని న్నీశక్తిబాణమున వధించెదను నిలువుము. (బాణ మెత్తును)

విభీ—హా సౌమిత్రీ! రక్షింపుము.

లక్ష్మ—రావణా ! తాళుము. ముందు నన్ను జయించి విభీషణుని వెదుకుము.

రావ—ఏమి ! ముందు నిన్నుజయింపవలయునా ? నీ కట్టియభిలాషమున్నచో నే నేల కాదందును ? రమ్ము రమ్ము.

26 అనుబంధము.

(యుద్ధముచేయుదురు. రావణుఁడు శక్తిబాణమువదలును-లక్ష్మణుఁడుమూర్ఛిల్లును)

విభీ—హా హా సౌమిత్రీ ! సౌమిత్రీ ! ఈ పాపాత్మునిపాలఁ బడితివా! తండ్రీ ! హా రామచంద్రప్రభూ ! రామచంద్రప్రభూ ! నీతమ్ముని జంపినపాపిని వధింపరమ్ము. రమ్ము

(నిష్క్రమించును.)

రావ—ఈ లక్ష్మణు నెత్తుకొనిపోయి కాళికి బలియిచ్చెదను. ఎత్త బోయి) అబ్బబ్బ ! ఎంతబరువుగానున్నాఁడు. కైలాసాచలము నవలీలగా నెత్తిన నాకీశాలుఁడు సాధ్యముగాకున్నాఁడే?

హను—(ప్రవేశించి) ఛీ, ఛీ, పాపీ! లే. అతనినెత్త నీసాధ్యమగునా?

క. శిరములు పదియైనను, నీ

కరము లిరువదియునైనఁ ♦ గానీ, యిఁక నీ

ధరను దుస్సారోన్నతగిరి

వరమైనను పిండియగు న ♦ వారణ ముష్టిన్. (గుద్దును

రావ—సెబాస్ ! మారుతీ ! సెబాస్ మెచ్చితిని. నీదెబ్బకుఁ

మెచ్చితిని.

గీ. రామ రావణ సంగ్రామ ♦ రమ్య మొక్క

యెత్తు మారుతిదెబ్బ యొ ♦ క్కెత్తుగాఁగ

చూర్ణమయ్యెను శల్యముల్ ♦ చుఱుకఁ గాంగె

చిఱుత విశ్రాంతిఁ గైకొని ♦ మరల వత్తు.

(నిష్క్రమించును)

హను—హా, హా, లక్ష్మణకుమారా ! లక్ష్మణకుమారా ! శ్రీరా

మమూర్తి నిన్ను నాకప్పగించి రణరంగమున కంపెను గదా

నే నేమొగము పెట్టుకొని యానుగుణాలంకారునిఁ జూచెదను.

హా రామచంద్రప్రభూ ! రామచంద్రప్రభూ !

(రాముఁడు, విభీషణుండు ప్రవేశము)

రాము—హా తండ్రీ ! ఎక్కడనుంటివోయి నాయనా ?

హను—మహాప్రభూ ! ఈ నిర్భాగ్యుఁడగు నాంజనేయుని దగ్గర.

ఇటు స్వామీ ! —ఇటు—ఇటు.

రాము—హా హా తమ్ముఁడా !

ఆ. కట్టవెన నిన్ను ♦ కరముల గదియించి

యకట ! తమ్ముఁడా య ♦ టంచు నేడ్చి

కనుల నీరు గార్పఁ ♦ గలుగుటకన్న, నే

నేమిసేయువాఁడ ♦ నివుడు కుజ్ఞ !

సుగ్రీ—మహాప్రభూ!దుఃఖింపఁగూడదు. కర్తవ్య మాలోచింపుఁడు

రాము—సుగ్రీవా ! నే నేమి చూచుకొని యిప్పుడు శాంతి

నొందుదును ?

గీ. హస్తపంచశతంబున ♦ నర్జునుండు
బాణముల నైదుసారులు ♦ వదలునంట
యొక్క వేళనే తద్రీతి ♦ నొక్కమారె
బాణములు వీడు వీరుఁడౌ ♦ భ్రాతుఁడితఁడుగా !

సుగ్రీ — అయ్యా! మఱేమియుఁ దొందరలేదు. సుషేణుఁడు హనుమంతునిచే సంజీవకరణిని దెప్పించి లక్ష్మణస్వామికి జీవప్రదానముఁ జేయుమనని చెప్పినాఁడు. ఆంజనేయా! సుషేణుని కడకు వెళ్ళుదము రమ్ము. తెల్లవారులోపలనే సంజీవికరణి చేరవలయు. తెల్లవారినచో సౌమిత్రి జీవించుట దుస్తరము. అప్పుడే రెండవఝామము నడచుచున్నది రమ్ము.

రామ — ఆంజనేయా! నా ముగ్వురు తమ్ములకన్న నీవే పెద్దతమ్ముఁడవని మన్నింతును. సతీతిలకము జూడఁ గొనివచ్చి నా ప్రాణము నిలిపితివి; సంజీవిఁ దెచ్చి నా తమ్ముని ప్రాణములు నిలుపుము తండ్రీ!

హను — రామచంద్రప్రభూ! రామకార్యము కొఱకే యీ మారుతి జనించి యున్నాఁడు.

(సుగ్రీవునితో నిష్క్రమించును.)

రామ — హా తమ్ముఁడా! తమ్ముఁడా! పలుకవా! పలుకవా! నాయనా! నాయనా! పాపుఁడనైన నాతో మాట్లాడవా? హా! నీవంటి సోదరుఁడు నావంటి మందభాగ్యునకేలదక్కును? రాష్ట్రమును విడచి, తల్లిని విడచి, సతిని విడచి, సౌఖ్యమును విడచి, నిద్రాహారములను విడచి, నన్నే సర్వముగ నమ్మి మహారణ్యములలోఁ బదునాల్గువత్సరములు నాతో పడరాని పాట్లు పడి నాతండ్రీ—నాతండ్రీ—నేనింక జీవించి యుండఁగా నీ పిట్టజకకు వచ్చితివా? లక్ష్మణుఁ డేడి యని యడుగు నీ

తల్లికి నే నేమి చెప్పఁగలను? మాతాపుత్రుల నెడఁబాపిన పాపము నాకొంతుక కురితాడై చుట్టుకొనదా? నీచే సేవఁ జేయించుకొనుటయే కాని, నీకెప్పుడు నేయుపకృతియుఁ జేసి యుండను గదా! ఈ యుద్ధమందైన నిన్ను రక్షించుటకైన నశక్తుఁడనైతిని గదా! ఇట్టి యశక్తుని నమ్మి నీవు మోస పోయితివి. నీకొంతుక నేను గోసితినిరా తండ్రీ! హా! సీతా! మహానుగుణసంపన్నుఁడై, మనకుఁ బుత్రప్రాయుఁడై, పాద భక్తుఁడైన నీమఱఁది యవస్థ వింటివా? హా సౌమిత్రీ! హా సుగుణరాశీ! హా మహాధనుర్ధరా! హా బాహుపరాక్రమవిల సితకార్తవీర్యా! (ఏడ్చును.)

విభీ—మహాప్రభూ! గుండెలు పగుల శోకింపవలదు. సుగ్రీవుఁడేదో యొక దారి చూపినాఁడు గదా!

రామ — అన్నట్లు సుగ్రీవుఁడు హనుమంతుని బంపినాడేమో?

సుగ్రీ...(ప్రవేశించి) మహాప్రభూ! పంపితిని. ఇక్కడికి కిరువదిమూఁడు లక్షల యిరువదిచేల యిన్నూట యిరువదామడ దూర మునను ద్రోణాద్రి కదిగో, అంజనేయుఁడు గరుత్మంతుని వలె నాకాశమార్గమునఁ జనుచున్నవాఁడు.

రాము—ఆహా! అంజనేయుని భక్తి! నే నెట్టులాతని ఋణముఁ దీర్చుకొందును?

సుగ్రీ—మహాప్రభూ! మీ దాసు నట్లాడఁదగునా?

విభీ—రామచంద్రమూర్తీ! తమ్ముని వక్షస్థలమున నాటిన యాశక్తిని దీసివేయవలయునని కపులందఱు కష్టపడిరి. వచ్చినది కాదు. మీరు లాగవలయు.

రాము—(శక్తిని దీసివేసి) తమ్ముఁడా! ఎంతకష్టపడితివి? నాయనా! సుగ్రీవా! విభీషణా! ఎట్టితమ్ముఁడు పోయినాఁడయ్యా!

## 27 అనుబంధము.

సీ. ఘనచతుర్దశవర్ష ♦ వనవాసదీక్షను
 పలుపంగఁ దండ్రి యా ♦ జ్ఞను ధరించి
వెడలుటచే నన్నుఁ ♦ బితృవాక్యపాలకుం
 డనుచు లోకము కొని ♦ యాడునంట
తండ్రి పోన్మనలేము, ♦ తమ్ముఁడా రమ్మని
 నేను పల్కఁగలేదు, ♦ మాను మనిన
మాన కీగతి ఘోర ♦ కాననముల నాకు
 వివిధసేవలు చేయ ♦ వెడలివచ్చి
వనుల నన్ను సుఖము ♦ పాల్జేసి తా నేల
పాలయిన కుమార ♦ పర్యుఁడితఁడు
కాని యిట్లు నేను ♦ గడతేరనైతి నీ
పావనుండు పోవ ♦ బ్రతికియుంటి.

హా తమ్ముఁడా!

ఆ. చావుకోలకు నీవు ♦ సాంద్రాటవుల వెంట
 వచ్చినావు నన్నుఁ ♦ బాయలేక
అకట! వెంట నిట్లు ♦ లాకర్షణముఁ జేసి
 నట్టి మృత్యువైతి ♦ నయ్య నీకు!

సుగ్రీ. మహాప్రభూ! ధైర్యసాంపూర్తిలు, మా కందఱకును జెప్ప వలసినవారు, ముందు దారి యేదో చూడవలసినవారు తమ రేకర్తవ్యమును మాని చింతిల్లిన మాకు గతి యేమున్నది?

రాము—సుగ్రీవరాజా! నాదుఃఖమును నేనేకాంతమున నణఁచుకొని దిగమ్రింగవలసినది గాని యెవ్వరితోఁ జెప్పుకొనిన నెవ్వరి కేమి తెలియును? అంతటివిరోధి, నీవు చంపింపఁగా చచ్చిన

నీయన్న వాలిమృతికి నీవుపడుచుత మానుదాసనవలె నేడ్చితివే? అదిగాక, సుగ్రీవా ! నాతమ్ముఁడు దండతితమ్ములవంటివాఁ డఁటయ్యా! అయ్యయ్యో! ఇట్టితమ్ముఁడు- ఇట్టి పరమభక్తుఁ డు,అహోరాత్రులు శ్రమయనక. నాకంట విడువక.సీత నిష్ఠురములాడినను, నేను వియోగదుఃఖమున కోపపడినను, సహించినా సేవయే గనకసారకముగా, మహావీరుఁడయ్యు నాయెడలనెప్పుడుగతిఁ బ్రవర్తించి నాకొఱకే తనప్రాణములను సమర్పించిన సుగుణరాసి. ఇట్టివాఁడు నాకు కోటిజన్మములెత్తినను లభించునా ? నాకీలోకమంతయు నొకటియు, నాముద్దుతమ్ముఁడు లక్ష్మణుఁ డొకటియుఁ గాదఁటయ్యా ! సీతను సయితము నాతమ్మునివలెఁ బ్రేమించియుండనే ? ఆనాఁడు పదునాలుగేండ్లకుఁ బూర్వమున నాపట్టభంగమైనదను దుఃఖమునఁ గేవలమునాపై భక్తిచేఁగన్నతండ్రినిసయితము కరవాలమునఁ బాలుగావింప సిద్ధమైన తమ్ముఁడు- అరణ్యములకు నేను రావలదనినప్పుడు లోకమే మునింగినట్లు కన్నీరు మున్నీరుగా నేడ్చుచు నాపాదములను బట్టుకొని వదలని నాతమ్ముఁడు- "నాయనా! నిన్నుసైత మడవికిఁ గొనిపోవుదు"నని పలికినంతమాత్రమున మహానందమున జానకితో "వదినా అన్నయ్య సమ్మతించినాఁడు. నాకడవిలో మీకు సేవఁజేసికొను భాగ్యమబ్బె'నని పలికి యెంతో యుప్పొంగి, కారడవులకు వచ్చుటే కైవల్యపదవిగా నెంచి సంబరపడిన నాతమ్ముఁడు- ఎప్పుడు పుట్టితిమో నాఁటిదినమునఱకు నన్ను నీడవలెనే కాచుకొనియుండిన నాతమ్ముఁడు- ఇట్టి తమ్ముఁడు కడతేరె- సుగ్రీవా ! నా కూఱట యెట్లు గలుగును ? నాకష్టముల నన్నింటిని బైనిడుకొని కాలిలోముల్లయినను నాటనీయకుండ రక్షించినవానికి, నామూలమున నింత దారుణముగు క్రూరనిశిత

బాణముచే దుర్మరణముఁగలుగఁగా నాకింకెక్కడిశాంతి? నాకింకెక్కడిజానకి? ఇంకెక్కడితల్లులు? ఎక్కడిభరతుఁడు? అంతయుమిథ్య అయిపోయినది. రామనాటకమునకు నిర్వాణశ్లోకము సమీపించినది. ఆహా! ఇంతేకదా! విభీషణా! ఒక్కఘడియకు రాఁబోవుపాటు నరునకుఁ దెలియదు గదా! ఇంతటి నియోగము నెఱుఁగలేక మానవుఁడు భువికి దివికి జాలములు పన్ని యింద్రుని చింతామణికిని, శేషుని శిరోమణికిని, లంకెలు వేయుచుండునుగదా; ఎంత భ్రమపడితిని! ఎంత మోసపోయితిని!

గీ. బుద్బుదప్రాయమై భ్రమా ♦ పూర్ణమైన
జనుని యిహజీవితంబు శా ♦ శ్వతము కాదు
బంధుసంబంధ విభ్రాంతి ♦ వడయుకన్న
సన్యసించుట మిగుల ప్ర ♦ శస్తతరము.

విభీ—రామప్రభూ! ఏమిది? ఇంత జాలి మీకుఁదగునా? తమవంటి సత్యసంధులకుఁగష్టములు రావు. సౌమిత్రి యొన్నఁడును మరణించువాఁడు కాఁడు. కలకలలాడు మొగముపైఁగల యీ శుభ చిహ్నములం బరికింపుఁడు.

రాము—విభీషణా! ఇంకెక్కడి తమ్ముఁడు? ఇంకెక్కడియాశ? నాకీపట్టియాశ లేఁదుమా పెదరు? (చేయి గడ్డమునఁ జేర్చి చింతిల్లును.)

సుగ్రీ—విభీషణా? ఈమహాత్ముఁడెంతంగో ధైర్యమును బాసెను?

విభీ—వానరరాజా! సందేహమేమి? లక్ష్మణమూర్తి రామచంద్రుని కట్టితమ్ముఁడో చూచుటలేదా?

సుగ్రీ—మహాత్ముఁ డేమో చింతిల్లుచున్నాఁడు.

విభీ—రామప్రభూ! ఊరక విచారించుచుండుటకు కారణమేమి స్వామీ!

రాము—ఏమియును లేదు. విభీషణా! నీవిషయమే చింతించుచున్నాను.

విభీ—మహాత్మా! నావిషయ మేమి?

రాము—దూరపర్వత న్యాయముగా నీవు వ్యర్థుఁడనైన నావిషయమై భ్రమపడి తోడఁబుట్టిన వానితో నైతము విరోధపడి వచ్చితివి. ఇంక నీగతి యేమగునా యని.

విభీ—అయ్యో! మహాత్మా! అట్లుపలికెదరేమి? నేనెందుబోవుదును ఒకమారీ శరీరమును తమ పాదపద్మములకడ సమర్పించిన తరువాత తిరిగి యెన్నఁడైన నన్యథాజరుగునా? లక్ష్మణస్వామితోపాటీశరీరము తమకొఱకే వదలఁదలఁచియున్నాను.

రాము—హాహా! నాసేవవలన మీకుఁగలుగులాభము జీవన్ముక్తియా? అటులయిన నేనాశ్రితమారకుఁడనేనా!

సుగ్రీ—హరిహరీ! హరిహరీ!

రాము—సుగ్రీవా! ఇల్లువదలివచ్చిన ముగ్గురిలో నొకతె రాక్షసుని పాలయ్యెను. ఇంకొకఁడు నేలపాలయ్యెను. జానకికొఱకై తమ్మునితోఁడు నమ్ముకొని నిన్నుదూషించి బలవంతపరచి యుద్ధమునకులాగి ససైన్యముగా నీకు మహాశ్రమఁ గలిగించితిని. నన్ను క్షమింపుము. నాకింక జానకిలేదు. తమ్ముఁడులేడు. యుద్ధప్రయత్నము లేదు. మారాక్షక కిష్కింధకుఁ బొమ్ము. విభీషణా! భరతునకుత్తరము వ్రాసియిచ్చెదను. నీ క్షేమమును నా భక్తుఁడగు భరతుఁడు కలుగనీయఁడు. నాకు మారుగ నయోధ్యనేలుకొమ్ము. పొమ్ము వాగ్దాన ప్రకారముగా నీకు లంకారాజ్యము నీయలేక పోయితిని. క్షమింపుము.

సుగ్రీ, విభీ—హా! హా! మహాత్మా! ఏమిమాటలివి?

రాము—ఇందుఁ దప్పేమియులేదు.

సీ. రామచంద్రాశ్రిత • పాపనాశకనామ.
రామకృష్ణాకేశ • సహనపోయి

శక్తిహీనంబైన ♦ శవమును మీఁరౌశి
యించుట యిఁకమీఁద ♦ హితవుకాదు
సేనతోఁగిష్కింధఁ ♦ జేరుమా సుగ్రీవ !
మదిలోన రాముని ♦ మఱచిపొమ్ము
కడు మోసమయ్యె నా ♦ కతన విభీషణా !
లే పొమ్మయోధ్యఁబా ♦ లించుకొమ్ము

గీ. జనకజ కశోకమే మృతి ♦ స్థలమటంచుఁ
బంచవటి యా మరణము, నా ♦ పట్టమంచు
ననఘ సౌమిత్రి నేలపా ♦ లయ్యెననుచు
భరతునకు వార్త దయయుఁ ♦ బంపుఁడయ్య.

సుగ్రీ—అయ్యయ్యో! శోకవేశమున మీరుపలుకరానియశ్లీలంబులఁ బల్కుచున్నారు. స్వామీ! తెల్లవారులోపల హనుమంతుఁడువచ్చి సంజీవికరణిచేఁ దమ్ముని జీవింపఁజేయఁగలఁడు. నామాటలనింతైనవిశ్వసింపరా? మీకింతిశోకముతగునా దేవా?

రాము—సుగ్రీవా ! ఏమంటినో తెలియని యున్మత్తావస్థలోనుంటిని. నాతోఁడనిప్పుఁడేమియుఁబలుకవుఁడు. తమ్మునిశరీరమునునన్ను గట్టిగాఁ గౌఁగలించుకొననిమ్ము. హాతమ్ముఁడా! తమ్ముఁడా! (కౌఁగలించుకొనును.)

(తెరలో)—ఓహో!కపియోధులారా!మీరాముఁడెక్కడ?మీరాము డెక్కడ?

గీ. తరుణివిడచిన దుఃఖంబు, ♦ తమ్ము చావు
నిరుదెసల మహార్తి వఁ ♦ హింపఁజేయఁ
దెలివిదప్పినవాఁడేమొ ♦ తెలియఁజెప్పుడు
రణమునకు వచ్చె రాక్షస ♦ రాజటంచు.

రాము—(మహాగ్రహముతో లేచి) రే! రావణచండాలా! ఎందుఁబో

యెదవురా పాపీ? నిలువుము. పాలచెక్కులు ముదురనిబాలుని జంపిశూరుఁడనని డంబములాడుచుంటివా? ఛీ, ఛీ నాతమ్ముని ప్రాణములే పోవఁగానేనీమొండిజీవములపై నాశవహింతునా? నిన్నుఁదునామున్కలు గావించి యీశరీరమును వదలెదను. నిలువుము. విభీషణా! తమ్మునిశరీరము జాగ్రత్త. ఈ పాపాత్ముని యమపురి కంపివచ్చెదను.

28. అనుబంధము.

రావ — (ప్రవేశించి) రామా! రమ్ము. నీతో ముఖాముఖిని సంగ్రామ మాచరింప ననేకదినములనుండియు నభిలషించుచుంటిని. ఇఁక తమ్మునిపాటున కేడ్చెదవో! సతికొఱకు రోషపడెదవో! నీదురవస్థను సమర్థించుకొందువో!

రాము — రే, వృథావాగాడంబరప్రవీణా! రావణా! ప్రేలఁబోకుము. ఒక కలఁగనినంతనే తెల్లవారెనే? ఇల్లలికినంతనే పండువ యయ్యెనే! నాతోపాటు వేఁడు నీబాంధవులు నీమృతికి కేడ్వ కుందురని తలఁచితివా,

గీ. ఇదె యధిజ్య కోదండ మి ♦ య్యదె శరంబు
సర్వదానవసంహార ♦ సమయమిదియె
బవరత్రిపురారి వీర రా ♦ ఘవుఁడితండు
పారిపోయిన విడువఁడో ♦ పాపకర్మ.

(ఇరువురు యుద్ధమొనరింతురు. రావణుఁడు పాఱిపోవును.)

రాము — ఛీ కలుషాత్మా! నిన్నింక విడువను శరణాగతుండవైనఁ గావలె శరీరగతుండవైనఁ గావలె

29. అనుబంధము.

(నిష్క్రమించి, తిరిగి రాముఁడు, రావణుఁడు ప్రవేశము.)

రావ — (ప్రవేశించి) రామా! బాణము లుపసంహరింపలేమి? నీవు

ధర్మయుద్ధ మాచరింతునని తెలివిమాలిన నీబానిసం దలు
బట్టుః పలెఁ బొగడుచుండురే! ఏదీ నీధర్మయుద్ధము? వెన్నుఁ
జూపిన శత్రునిపై విల్లువంచనగునా?

రాము—నీ వహంభావమును మాని శస్త్రసన్యాసంబును గావించి
పలాయితుండవైనచో నిన్నల్లే క్షమించి వదలియుందును.
నీకరమున నం దాయుధ మున్నంతవఱకు నిన్ను వెంటాడక
మానను.

రావ—నాకరమునం దాయుధ మెక్కడనున్నది?

రాము—ఎక్కడనున్నదో సరిగా చూచుకొనుము. నీపదునెనిమిదవ
కరంబున నొకగదాశకలము గలదు చూచుకొనుము.

రావ—రామా! మెచ్చితిని. నీరణధర్మమునకు మెచ్చితిని. ఇదిగో
అస్త్రసన్యాసం బొనరించితిని. (గదను పారవైచి) మిగుల
బడలితిని. ఇప్పటికి నన్నుఁబోనిమ్ము. మరలివచ్చి సీతఁ
బోరెదను.

రాము—అటులనే కానిమ్ము. ఇదిగో బాణములను నేనును బొదిలో
నుంచితిని. విల్లుడించితిని. క్షేమముగా నింటికిఁ బొమ్ము.
తిరిగి శీఘ్రముగరమ్ము. (రాముఁడుబాణములను ముడవఁగా
రావణుఁడు తిర్యఙ్ముఖుడఁగును.)

ఇది పంచమాంకము



# షష్ఠాంకము.



## 1. వ రంగము.

(కాలనేమి శిష్యులగు పాషండ పంచములు ప్రవేశింతురు)

**పాషం**—పంచమా! ఈ ముండకొడుకు కాలనేమిగాఁడు మనప్రాణములమీఁదికిఁ దెచ్చిపెట్టినాఁడురా!

పంచ—పాషండా! ఎంత దుర్మార్గుఁడైన గురువును తిట్టకురా గాడిదెకొడుకును.

పాషం—వీఁడి గురుత్వము మనశిష్యత్వముఁ గలఁబడి ఏడ్చి మొత్తుకొన్నట్లున్నది. మొన్నటిరాత్రి మనము మనతోఁబాటు త్రాగి దొర్లలేదని వాఁడు కొట్టినచావుదెబ్బలకు యమలోకముం దనుక వెళ్ళి తిరిగివచ్చితిమిరా!

పంచ—వీనిమాటనమ్మి మనమిప్పు డాంజనేయునితో విరోధపడి మా అక్షయుని కడకు మనలనిద్దఱు సందేశమునిచ్చి పంపఁ గలఁడు.

పాషం—ఔను. మనము వీని బెడదవదలించుకొనుటకు నాకుచక్కని యుపాయము తోఁచుచున్నది ఉండుఁడు.

పంచ—పాషండా ! నీవు బుద్ధియందు శుక్రాచార్యులతో సమాన మైన ముండకొడుకవు. ఏదోయుపాయముం జెప్పితివా ! నీ మేలు మఱచిపోను.

పాషం—హనుమంతుండు వచ్చిన వెంటనే యీ కాలనేమిగానిని బట్టి యొప్పగింతము.

పంచ—ఓరి నీకుంపతెగ ! బిగ్గఱంగం గేకలు వేయకు. అదిగో గురువు ముండకొడుకు వచ్చుచున్నాండు. ఈమాట లేమాత్రము వాని చెవినింబడిన మనతాడు తెగును.

(కాలనేమి ప్రవేశించి)

కాల—శిష్యులారా ! ఏమైనది ?

పాషం }
పంచ } గురుభ్యోనమః.

కాల—ఏమైనదిరా?

పాషం—ఏమగుట కేమున్నది బాబూ ! మీకుంగాలమైనది.

కాల—ఓరి దుష్టుండా! నాకు కాలమగు టేమి?

పాషం—జపకాలమైనది గురునరా !

కాల—నాయాజ్ఞప్రకారముగా మీరు మాయచేత వృక్షములను కల్పించి యందు విషఫలములను నిర్మించితిరి గద !

పంచ—చిత్తము.

కాల—కమండలమున నేమి పోసితిరి ?

పంచ—కాంకూట విషము

కాల—సెబాసు ! మంచిపనిచేసితిరి. మీరే నాకుం దగిన శిష్యులు. నే నిప్పు డెటులున్నానురా ?

పాషం—బాబు ! మీావలె నేయున్నారు !

కాల—అనంగా?

పాపం.—కాలనేమి గురువుగారివలె నున్నారు.

కాల—ఆ! నేను తూరిపోలేదా! ఒకమునివలె లేనటరా? నీవు తెలివితక్కువ సన్యాసివి! పంచమా! నీవు చెప్పరా ఎటు లున్నాను నేను?

పంచ—మీరు మీవలె లేరు స్వామీ!

కాల—మఱి యెటులున్నాను చెప్పుము.

పంచ—గొప్ప ఋషీశ్వరుఁడవలెనున్నారు.

కాల—సెబాస్? అదిమాట. ఓరీ! పంచమా! పాపంమున కేమియుఁ దెలియదు.

పంచ—పాపండా! నీకేమియుఁ దెలియదేమిరా! తెలివితక్కువ గాడిదా! ఎప్పుడును గురువుగారి కిష్టనుగు మాటలే యాడుచుండుము. ఊఁ, తెలిసినదా!

పాపం—చిత్తము. ఇదివఱకుఁ దెలిసినదిగాదు.

కాల—సరే! ఇప్పుడు నేను గురుఁడను. మీరు శిష్యులు. హనుమంతుఁడు సంజీవిని దెల్లవారులోపలఁ గొనిపోయినచో లక్ష్మణుఁడు బ్రిదుకును. కనుక ఎటులైన నిందే నిలిపి తెల్లవార్పవలసినదని రావణరాజు నాజ్ఞ. నాప్రతాప మిఁక చూడుండు. నామాయచేత నాకాశమునను బ్రియాణము చేయుచున్న హనుమంతునకు దాహముఁగల్గించి యిందురప్పించెదను (మంత్రించును)

హను—(ప్రవేశించి) అబ్బా! ఏమిది? విచిత్రము! నాకేటికో భరింపరాని దాహముఁ గల్గుచున్నది. అంతరాళమున నిలువఁజాలనైతి. ఆహాహా! ఇదియొక ఫలతరువిరాజితమగు దివ్యవనము. ఇందేదైనఁ గాసారముగలదేమో చూచెదఁగాక!

కాల—శిష్యులారా! శ్రీరామభజనము నారంభింపుఁడు బిగ్గఱగా. తెలిసినదా!

శ్రీరామ రామ రామ రామ, (జపింతురు.)

హను—(విని) కర్ణరసాయనమమ్యో! ఎవరీ శ్రీరామభక్తాగ్రేసరులు? రామకార్యార్థినై చనుచున్న నాకీమహాత్ములు నాఁటి సంపాతి స్వయంప్రభలవలె సహాయములగుదురని తోఁచుచున్నది. సమీపించెదఁగాక !

ముగ్గురు—(శ్రీరామ రామ రామ (మఱింత బిగ్గఱగ జపింతురు.)

హను—(నమస్కరించి) ఓ శ్రీరామభక్తాగ్రేసరులారా ! మీపాదములకు రామదాసుఁడగు మారుతి నమస్కారములు.

కాల—(కన్నులు దెఱచి) ఓహో! వానరోత్తముఁడా ! అయ్యా ! నీవు హనుమంతుఁడవుకావుగద .

హను—మునిచంద్రమా! దివ్యచక్షులగు మీరుచక్కగా నెఱింగితిరి.

కాల—రామభక్తాగ్రేసరా! నీరాకనాకాశ్చర్యముఁ గొలుపుచున్నది నిరంతరరామస్మరణముఁజేయుచున్న నాతపస్సునకానందించి శ్రీరామచంద్రమూర్తి నాకడకు నిన్నుదూతగఁ బంపలేదుగద!

హను—మహాత్మా ! రామచంద్రమూర్తి మహావిపత్తునఁ జిక్కియున్నవాఁడు

కాల—ఆ ! ఆ ! నిజమా ! ఎట్టివిపత్తు ?

హను—విన్నవించుచున్నాను.

ఆ. మేరమీఱి యంను ♦ మిత్రసుతుఁడు రావ
ణుని వధింపఁ బోవ ♦ రణమునందుఁ
బాప మనక శక్తి ♦ బాణము సాధించి
యతని గాఢమూర్ఛ ♦ నొంద జేసె.

కాల—హా శ్రీరామచంద్రా ! శ్రీరామచంద్రా ! (మూర్ఛిల్లును.)

హను—అయ్యయ్యో! ఇదేమివిపరీతము ? రామభక్తుఁడగు నీతఁడు రామవిపత్కథనాలకించి మూర్ఛిల్లెను. అయ్యా ! లెమ్ము.

మనమిద్దఱము గలసి కర్తవ్య మాలోచింతము.

కాల—(లేచి) మారుతీ! ఇంకేమి కర్తవ్యము? మహాత్ముఁడగు లక్ష్మణుఁడు రావణుని శక్తి బాణమున మూర్ఛనందెనా! ఔరా! దానవాధముఁ డెంతపని చేసెను! హనుమంతా! చూచుచుండుము. వానిని నా శాపబలమున సంహరించెదను.

హను—మహాత్మా! నీవంతవాఁడగుట నిజమే కాని తొందరపడవలదు. రావణుని రామమూర్తియే వధింపవలయును.

కాల—వెఱ్ఱివాఁడా! లక్ష్మణుఁడు మూర్ఛఁదేరినఁ గదా రావణవధ?

హను—లక్ష్మణుని మూర్ఛఁ దేర్చుటకే నేను సంజీవికరణికై ద్రోణాద్రికరుగుచు దాహమగుట నిందువచ్చితిని.

కాల—ఆహా! మారుతీ! నీవుత్తమోత్తమ భక్తాగ్రేసరుఁడవు. నీయుద్యోగము సఫలమగును. నీవంటివారుండఁగ మావంటియల్పుల కడకు రారు. కావునఁ దెల్లవారుఁడనుక నిందుండి నాపూజల నందియరుగఁ బ్రార్థింతును

హను—మునీంద్రా! సూర్యోదయము మొదలు లక్ష్మణమూర్ఛ మృతిగాఁ బరిణమించును. కావున తెల్లవారకమున్నే నేనరుగవలయును.

కాల—ఓహో! అట్లయిన సత్వరము చనవలసినదే.

హను—నాకు దాహమగుచున్నది

కాల—అట్లైన నీవృక్షములందలి ఫలంబులచే దాహశాంతిఁజేసికొనుము. శిష్యులారా! ఈమహాత్మునకుఁ కొన్ని ఫలములను దెచ్చియుండు?

హను—అయ్యా! వలదు. రాఘవు లట్టిగతినుండ నేనెట్లు ఫలములు గంటుదును. ఈ సమీపమున నేదేని సరోవరము గలదేని చూపుడు. నీటిచేత దాహశాంతిఁగాంచి మఱల వేగముగ జరిగెదను

కాల—(తనలో) వీఁడెందును లోఁబడకున్నాఁడు! సరి కానిమ్ము. మఱొకయెత్తెత్తెదను. (ప్ర) మారుతీ! ఈయంధకారమున సరోవరము కేలనరుగవలయు? నాకమండలజలముల నిచ్చెదను.

హను—క్షమింపవలయు. నే నొకరంటిన జలములఁ ద్రావను.

కాల—(తనలో) అబ్బా! అంత నైష్టికుఁడవా! అట్లయిన నీనిష్ఠ నిపుడే వదలించెద. (ప్రకా) శిష్యులారా! ఈయన కీసమీపమందలి సరస్సును చూపుఁడు. అయ్యా! ఈబాలకులతో నరుగుఁడు.

హను—మహాప్రసాదము.

(శిష్యులతో హనుమంతుఁడు (నిష్క్రమించును.)

కాల—(తన) భళిభళీ! చక్కని పనిచేసితిని! ఈసరస్సున నొకభయంకర మకర మనేకదినములనుండియు నివసించుచున్నది. దాని నోటఁబడి బ్రదికిన వారింతవఱ కెవ్వరును లేరు. వీనికిదే మరణకాలము.

(నిష్క్రమించును.)

(తెర వ్రాలును.)

2 వ. రంగము:—సరోవరతీరము.

హను—(ప్రవేశించి) శిష్యులుచూపిన సరోవరమిదియే. వేగముగ దాహశాంతిఁజేసికొని యరిగెద. (నీటిలో దిగి నీరుఁద్రావి) ఆహా! పిపాసార్తునకు శీతోదకమే యమృతపానము కాఁగా సహజమధురమగు నీ క్షీరోదకము నాకమృతాధికమై, నూతన చైతన్యముం గలిగించి నాముకార్యమున కధికశక్తిం బ్రసాదించినది. ఇఁక నరుగవలయు. (పోవఁబోయి నిలచి) ఆఁ! ఏమిది? నాపాదముంబట్టుకొని యేదియో జలచరము ము

మనకు లాగుచున్నది. ఒకవేళ మకరము కాదుగద! ఆఁ! సం దేహమేమి ?

ఆ. మును గజేంద్రపాద ♦ మూలంబు గ్రహియించి,
వెతలనిడిన మకరి ♦ విధముగాఁగఁ
జరణమును గ్రహించి ♦ యరుదారబాధింపఁ
దొడఁగె మకరమొకటి ♦ దుష్టమగుచు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మమే నాకీయెడ సహాయమగునుగాక ! రఘురామ కరుణాప్రసాదంబున నిట్టి దుష్ట ప్రాణిలోకమెల్లఁ బలాపంచలగుఁగాక! జయ్ శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః (మకరి గర్భముఁ జించుచున్నాఁడు.)

(మకర మప్సరసగా మారుచున్నది.)

అప్స—మహాత్మా! అంజనీతనయా! నాశాపంబు బాపితివి! నీకనేక ప్రణామములు.

హను—అమ్మా! నీవెవ్వతెవు ?

అప్స—మహాత్మా! నేను ధాన్యమాలిని యనుపేరుగలయప్సరసను. కొండొక కారణమున శాపవశమున నిందు మకరమనై యుంటిని. నేఁటికి నీకృపచే శాపవిమోచన మయ్యెను. నీ యుపకారమునకై నీకొక్క రహస్యమెఱింగించెద. నీకు సరోవరముం జూపిన యీముని, నీమరణముఁ గోరిన కాలనేమి యను రాక్షసుఁడు. వీనిని వధించినపిదప నిరవశేషముగ, శ్రీరామకార్యముం దీర్చుకొమ్ము. నేను జనివినియెద.

హను—అమ్మా! భాగ్యము

అప్స—(నిష్క్రమించును.)

హను—రే! దురాత్మా! కాలనేమీ! కాలనేమీ! ఎంతమాసగాఁడవురా ! నీమరణము సమీపించినది నిలువుము.

(నిష్క్రమించును.)

(భయముతో పాషండపంచములు ప్రవేశింతురు.)

పాషం—ఓరీ! పాషండా! నేఁటితో మన పనిసున్నయైనది. మొదలి ఋప్పారసయై మనగుట్టు వెల్లఁబెట్టినది ఇప్పుడు కాలనేమిజాడ నాంజనేయుని కెఱిఁగించితిమా బ్రదికెదము.

పంచ—అవునురా. అదిగో హనుమంతుఁడిటే వచ్చుచున్నాఁడు చచ్చితిమి.

పాషం—రక్షింపుమని కాళ్లపైఁబడుదము. సిద్ధముగ నుందుము.
(తరువాతఁ గ్రోధముతో హనుమంతుఁడు ప్రవేశము.)

హను—రే! దుష్క్రియారంభ దానవాధములారా! నిలుఁడు, నిలుఁడు, పాఱిపోకుఁడు.

ఆ. ఘనుఁడు రామచంద్రు • కార్యంబు నోఁ దలఁ
దాల్చి యంబరమునఁ • దరలునన్ను
గాఢుసోక్త శక్తి • రప్పించి మడియింపఁ
జూతురే! నిలుండు • శుంఠలార!

పంచ } మహాత్మా! రక్షింపుము. (పాదముల బడుదురు.)
పాషం }

హను—బాలులారా! మిమ్ము రక్షించితిని. పాపియగు కాలనేమి యెక్కడ?

పంచ } మహాత్మా! ఆ పొదలచాటున నున్నాఁడు. చంపుము.
పాషం }

కాల—(కోపముతోఁ బ్రవేశించి) ఛీ! కృతఘ్నులారా! వారహాన్య మునీదుష్టున కెఱిఁగించుచుంటిరా! చచ్చితిరి చూడుఁడు. (చంపఁబోవును.)

పంచ పాపం } మహాత్మా! ఆంజనేయా! రక్షింపుము. రక్షింపుము.

హాను—ఓరీ! చండాలుఁడా! ఆ కాలురనటరా నీవు చంపఁ దలపడినది? కపటసన్యాసివై రామకార్యవిఘ్న మహాపాతక ప్రవృత్తుఁడవైన నిన్నుఁ జంపి రామహితంబు సల్పెద.

గీ. మోసమును బన్ని కపటస ♦ న్యాసివగుచు
మకరయుతవిష కాసార ♦ మధ్యమందు
జలముఁ గ్రోలఁగఁ బంపి నన్ ♦ జంపఁ దలఁచి
నట్టి నిన్నుఁ జేర్తు నిప్పుడే ♦ యమపురంబు.

(హనుమంతుఁడు కాలనేమినిజంపును)

(తెర వ్రాలును.)

---

3 వ రంగము:—యుద్ధభూమి.

(లక్ష్మణుఁడు మూర్ఛిల్లియుండఁగా విభీషణుఁడు, రాముఁడు, సుగ్రీవుఁడు మొదలగు కపులు ప్రవేశింతురు)

విభీ—మహాప్రభూ! తూర్పుదిక్కున నాకాంతియేమి?

రాము—ఏమి? ఏమి? మావంశమునకు మూలపురుషుఁడై యుండియు నీసూర్యుఁ డిప్పుడే యుదయించినాఁడా? ఇంత కావరమాయీభానునకు? తా నుదయించిన నాతమ్మునిప్రాణములకొఱకు జగద్వైలయమైనను సరే యీసూర్యుని వధించెదను.

30. అనుబంధము.

సుగ్రీ—మహాప్రభూ! క్షమింపుము. అది సూర్యకాంతి గాదు. మన యాంజనేయుఁడు తెచ్చుచున్న సంజీవికాంతి.

రాము—ఏమీ! నిజమేనా! నిజమేనా!

హాను—(ద్రోణాద్రితోఁ బ్రవేశించును.)

హను—శ్రీరామచంద్రమూర్తికి జయ్

సుషేణుఁడు—(ప్రవేశించి, మహాప్రభూ! సంజీవకరిణిని గుర్తింపలేక మారుతి ద్రోణాద్రినే పెకలించి తెచ్చినాఁడు. మారుతీ! నీవుందుము పర్వతమును దింపుము. నేను సంజీవకరణిని వెదకుదును.

హను—(దింపును.)

సుషే—(వెదకి తీసి) సర్వలోక శుభకరముగా సౌమిత్రి పునర్జీవితుఁడగుఁగాక!

లక్ష్మ—(లేచి) హా! రామచంద్రా!

రాము—తమ్ముఁడా! ఇక్కడనే యున్నాను. నన్నొక్కమాఱు కౌఁగలించికొమ్ము!

లక్ష్మ—(కౌఁగలించుకొని) అన్నయ్యా! రావణుఁ డేడి?

రాము—రావణ సంహారమున కింకనేగుదము. తొందరపడకుము. మారుతీ! నీయుపకారమునకు నేనేమియు మఱు మేలు చేయలేను. ముందెప్పుడైనను ప్రపంచ జనులు నా పేరుఁ దలంతురేని నాకన్న మున్నుగ నిన్నుఁ దలంతురు.

హను—అహా! శ్రీరామ లక్ష్మణులం జూచిన, భావి శ్రీరామ పట్టాభిషేక మిప్పుడేయైనట్లు మహానందమగుచున్నది. కపులారా! ఈ మానంగ సమయమున నోరార నీరాఘవులకు మంగళములఁ బాడి, యనంతరమున నన తర విధానమ్ముం బరికింతము

(అందఱు మంగళములు పాడుదురు.)

షష్ఠాంకము

సంపూర్ణము.

# అనుబంధములు.



1 కేదార్ — ధృపద్.

కపులు — శ్రీసీతానాథా మునిసేవిత ! దితిసుతహారణా ॥
భాసమాన । కమలనయన పరమానందాప్రమేయ
దాసపోష పాపనాశ ధరణీశ । రామచంద్రా ॥శ్రీ॥
కలుషహరణ కమలచరణ । గరుడవాహన మోహన
సుగుణభరిత విగతదురిత । సుమహితచరితా ॥శ్రీ॥

2 సిహేంద్రమధ్యము — ఆది.

రాముడు — గుణధామా కోవిదుడవో యంజనా ! విదుడవో యంజ
నా కోవిదుడవో యంజనా ॥గుణ॥
ఎంతయు శాంతినొంది ! వింతగానంగనా । వార్తలుదెల్పి
మాప్రాణముల్ నిల్పితివి ॥గుణ॥
సాహసోదారా రణధీరా । వరగంభీరా అంజనీపుత్రా
నుతిపాత్రా అతిదృఢగాత్రా । విదుడవో యంజనా ॥గుణ॥

4 పూరి — ఆది

విభీ — ఛీ! వంశనాశనుండ వౌ రఘునాథ ॥ఛీ॥
జననమాదిదనుజనీతి । నిలిపితి వధుములు సలిపితి ॥ఛీ॥
గతిగా మారుతిగా దోసముం బలుకగన్
న్యాయమావిధాయమా సుధేయమా విధేయమా ॥ఛీ॥

5 పూరి — ఆది.

విభీ — గర్వాలాపులు వీరలు తుదకొక గవ్వకైనఁ బనికిరాదు రావణ
సర్వవిషయముల నాలోచింపుము

సంగ్రామము నెదఁ దలఁపఁగఁ బోకుము ॥గ॥
రాముఁడు నిన్నెదుర్కొని సంగ్రామ మొనర్చుచుండఁగ
శితసాయకములు చురుకని నిను నొవ్వఁజేయుచుండఁగ
వేనవేలు దనుజులు పృథివీస్థలి డెగుచుండఁగ
నిను వీరు గావరారు సుమ్మి ఆ ఆ ఆ ఆ ॥గ॥

6. ఫీలు—ఆది.

విభీ—తగదు తగదన్నా యీవైరము ॥త॥
పగవాసఁగా రామభద్రు నెంచుట ॥త॥
అగణితమగు లంకాపుర లక్ష్మిని
పగతుం బాల్సేసి పాడుచేయుట ॥త॥
మనుజాంగనకయి । దనుజాన్వయమును
జనములతో నాశనముఁ జేయుట ॥త॥

8. భాగేశ్వరి—జంపె, (10. అక్షరములు)

రాముఁడు—

1. మదినిగలత నొందకయ్యా । మనకుఁ గలుగు దుఃఖమునకుఁ
దల్లడపాటుఁ జెందినన్ గలదే ఫలితము
ఘనమీశ్వర సంకల్పంబులకు
వికల్పమొక్కనాఁడుఁ గలుగదు॥ మ॥

2. అనుజుఁడసి మదినడలుఁ జెందక । అసాధ్యమని యనుమానమందక
సుధారుచిరమగు న్యాయబోధనము
సురుచిరముగ నొనరించితివి॥ సు॥
అంతటి పులస్త్యబ్రహ్మ । వంశభాగుఁడవై
దివిజాంతకు దశగ్రీవు కనుజుఁడవై

ఇపుడిటులవమానముఁ గొంది దుఃఖమతివై
శరణంచును నీయంతవాఁడు నిఁక గోరుకన్నఁగల దెభాగ్యము॥ మ॥

9 పీలు—త్రిశగతి.

విభీ—శ్రీరాముని దలచితి మానసాగా । మిముఁజేరితి కపులారా।
క్షమియింపుఁడన్న లారా॥ శ్రీ॥

వైరిసోదరుఁడనటంచు । వాదినెంచకుఁడయ్యా
దేవాగిపీఁడటంచు నాగ్రి । హాముజెందకుఁడయ్యా
కూరిఁ బానపుఁడనటంచు । కోపింపకుఁడయ్యా
యేదారిలేదు రాము పాదముల నమ్మినాఁడనయ్య॥ శ్రీ॥

10. సురట—ఆది.

హను—చింతిలఁబోకయ్యా । విభీషణా॥ చింతి॥
భ్రాంతిఁగొనియగా రావణహంతకుఁడు
పాదతాడనముఁ గావిఁచెనుగా॥ చిం॥

క్రూరుఁడు చోరుఁడు రావణుఁడూ
కూలుటనిక్కము చూడుసుఁడూ
శ్రీరామచంద్రుఁడసేవారతి
సేవింపుము భావింపుము నెమ్మది॥ చింతిల॥

మనకందరకీ మహాత్ముసేవయె
యనుదినమును భవతారకమూ
ధనకనకాదు లశాశ్వతంబు లీ
ధన్యుసేవయె శాశ్వతఫలదము॥ చింతిల॥

## 11. మోహన — ధ్రుపద

కవులు—నమోస్తుగంభీరమూర్తి । సమస్తజలచక్రివర్తి
సమానరహితోరుకీర్తి । యమానుషజలాదిశక్తి
యమేయరత్నప్రశస్తి । విమోహిత తరంగవర్తి ॥న॥

## 12. బ్యాగ్ — ఆది.

రాము—హా నీకావరము౯ సహింతునె ॥హా॥
బాణకోటులను బంపెద నిఁక నీ
ప్రతాపసారము నణగించెదరా ॥హా॥
భాస్కరవంశోద్భవసంజాతుఁడ
బహుళశత్రుదర్పనిర్భేదకబాహుఁడ
ప్రకటాశుగసంభవానలోద్ధతిఁ
బరిమార్చెదఁజసిదీర్చెద మార్చెద ॥హా॥

## 13. కాఫీ — ఆది.

సముద్రుఁడు—ఇటులఁ జేయుట న్యాయమె నీకో
యినవంశాంబుధిపూర్ణ సుధాకర ॥ఇ॥
పటుతరలయకాలము సంభవమయె
భానుఁడు ప్రాగ్దిశ భవమొందెనో కో
శత్రుఁడనని నీచాపము నెత్తకు
మిత్రుఁడ నీకయి పాత్రుఁడ పతితుఁడ
శరణమయ్యె నీ చరణయుగములకుఁ
కరుణాకర వేగమె రక్షింపుము ॥ఇ॥

4. సారంగ—ఆది

అంగ—లోకాభిరామ। వైకుంఠధామ రామ ॥లో॥
నాకేశవినుత। పావననామా
నారదవందిత। నీరదశ్యామా ॥లో॥
రఘువంశాంబుధి। రంజితసోమ
రాత్రించరసం। హారిమవిరామా ॥లో॥

15. కాఫి—ఆది

అంగ- ఎంతద్రోహ మొనరించితివర రే॥ భ్రాంతిమీఱగ జానకిఁగొనిరావణ॥
నాశనముగ॥ దెలియకసీ। తాపతినిగ। దెచ్చితివా
దెచ్చి చచ్చు పాపిష్టిగంటి వరెరె ॥ఎంత॥

16. హనుమతోడి—ఆది

అంగ—మదమున పేలకుమా। రాక్షసరాజ ॥మ॥
మదదైత్యులఁబరిమార్చుశక్తి రా
సదయాత్ముఁడవై జానకినిడరా
సద్వంశము నాశనము సలుపకుర ॥మ॥

17. పీలు—ఆది.

త్రిజట—ఎంతద్రోహ మొనరించినాము। మా
పూర్వభవంబునఁబుణ్యాత్ములకు ॥ఎం॥
పాపంబుజేసితిమో। బిడ్డపాపలఁ బాపితిమో
యేసదయాత్ములేద్వంగ మేమానందంబునొందితిమో
యీగతిగ। దుఃఖాబ్ధిగ। దూలంగగ। సోలంగ ॥ఎం॥

# సంపూర్ణాంజనేయము

(గ్రంథకర్త:— కొడాలి సత్యనారాయణరావుగారు)

వెల 1—0—0 మాత్రమే.

పసితనంబుననే యెవండు ప్రచండభానునిం గబళింపనుద్యమించెనో, సూర్యు నారాధించి యెవండు సకలవిద్యాపారంగతుండయ్యెనో, శ్రీరామచంద్రమూర్తి కెవండు దాసానదాసుండై మెలంగెనో, సుగ్రీవునిమంత్రియై యెవ్వండు రాజకీయ వేత్తయనెడి కీర్తినందెనో, తారకనామమంత్రపఠనముచే నెవ్వండు ముక్తికాంతను హస్తగత మొనర్చుకొనెనో అట్టి హనుమంతుని దివ్యచారిత్రము నెవ్వరు దృశ్యప్రబంధముగ రచియించి యుండనికొఱంత నీగ్రంథకర్త గారు తీర్చినారు నాలుగవ కూర్పునకు వేచియున్నది.

—♦ శైలిపద్యము ♦—

సీ. పండంచు భ్రాంతిలి ♦ పైకెగసినయప్పు
స్వయముగాఁ గన్నభా ♦ స్కరుడు సాక్షి,
ఇతని దెబ్బలకు స ♦ హింపక యోడిన
రాహుగ్రహాదుల ♦ క్రమమె సాక్షి,
సూక్ష్మరూపిగ భూమి ♦ చుట్టుఁ దిరిగి సూర్యు
దరి నేర్చినట్టి వే ♦ దములె సాక్షి
బలసత్త్వముల ప్రభా ♦ వంబు వనులయందు
ననుభవించినయట్టి ♦ మునులె సాక్షి

నారుషిరననేల? దే ♦ వతలె సాక్షి
వరము లిప్పించి మనిచిన ♦ బ్రహ్మసాక్షి
అట్టినో దేవ! నీనికి ♦ సరివికాని
కార్యమున్నదె మూర్ఖులో ♦ కములయందు?

# సంపూర్ణరామాయణము

(గ్రంథకర్త:—గూడూరి కోటీశ్వరరావుగారు)

కల్యాణ గుణాభిరాముని యుత్కృష్ట చరిత్రమును నెందరు మహాకవులు రచియించినను శ్రీరామకథయగుట నెల్లరందఱివిరచితములఁ బఠించుట ధర్మమేకదా! ఒకఆర్డరును దయచేయుఁడు.

వెల రూ 1—4—0

—♦ శైలిపద్యము ♦—

శా॥ కారుణ్యంబున రామచంద్రునకు నన్ ♦
కల్యాణమున్ జేసి నీ
వీరీతిన్ బెడఁబాసి మన్నునఁ గటా ♦
యెట్లుంటి విన్నాణముల్? హా!
పారంబింతయులేని ప్రేమమున నా ♦
ప్రాణేశు నన్నార్పఁగా
జేరన్ వచ్చితి చంతెజాలు నినునే ♦
జేకొందు నో రక్షకా॥

వలయువారు:—

చందానారాయణ శ్రేష్ఠి,

బుక్ సెల్లర్; జనరల్ బజార్,

పోస్టు —మార్కెట్

శికింద్రాబాద్ (దక్కన్.)